# MEDICAL DICTIONARY



డా॥ **K.V.N.D. ప్రసాద్**, D.H.M.S., M.H.S. (LONDON),

వ్యవస్థాపకులు :- హోమియో, ప్రకృతి, ఆరోగ్యపరిషత్:

చీఫ్ ఫిజిషియన్ :- ఛారిటబుల్ డిస్పెన్సరీ

చెరుకుపల్లి-522 309.



☎ (08644) 23037, 22392.



## జనప్రియ పబ్లికేషన్స్,

అగ్నికుల క్షత్రియుల వారి వీధి-II,

గంగానమ్మపేట, తెనాలి-522 201.

# MEDICAL DICTIONARY


| | |
|---|---|
| ముద్రణము : ఫిబ్రవరి, 1999. | Edition : FEBRUARY, 1999. |
| అన్ని హక్కులు : జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by : JANAPRIYA PUBLICATIONS-TENALI. |
| వెల : రూ॥ 12-00. | Price : Rs. 12-00. |
| ముద్రణ : విజయలక్ష్మి ఆఫ్-సెట్, తెనాలి-522 201. | Printers : VIJAYA LAKSHMI OFF-SET, TENALI-522 201. |
| ముఖ చిత్రము : వి. ఎస్. ప్రకాశ్, విజయవాడ-3. | Cover Design : V.S. PRAKASH, VIJAYAWADA-3. |
| డి.టి.పి. : జనప్రియ గ్రాఫిక్స్, తెనాలి-522 201. | D.T.P. : JANAPRIYA GRAPHICS, TENALI-522 201. |
| ముఖచిత్ర ముద్రణ : సౌందరమ్ ప్రింటర్స్, చెన్నై-21. | Cover Printers : SOUNDARAM PRINTERS, CHENNAI-21. |

ప్రతులకు : ☎ (08644) 23037, 22392. For Copies :




JANAPRIYA PUBLICATIONS,
Agnikula Kshatriyula vari Street-II,
Ganganamma Pet, TENALI-522 201.

# CONTENTS (విషయ సూచిక)

# ముందుమాట

ప్రియాతి ప్రియమైన అఖిలాంధ్ర పాఠకులకూ నా నమస్సుమాంజలుల నర్పించుకుంటూ... ఈ పుస్తక కూర్పరిగా ఒక్కమాట చెప్పదలచాను. "మెడికల్ డిక్షనరీలు అనేకముగా ఉన్నవి గదా? మరలా దీనిని కూర్చి, ముద్రించుటలో గల ఉపయోగ మేమిటి??" అని కొంతమంది మిత్రులు నన్ను అడిగారు. ఇంతకు ముందు వున్న మెడికల్ డిక్షనరీలు అన్నీ దరిదాపుగా వైద్యులకూ, విజ్ఞానవేత్తలకూ ఉపయోగ పడునట్లుగా ఉన్నవే గానీ... సామాన్యులకు అర్థమగునట్లుగా లేవు. అంతేగాక... అవి అందరికీ అందుబాటులో కూడ లేవు. ఈ ఉద్దేశము తోనే... సామాన్యు లందరికీ అర్థమై అందుబాటులో ఉండునట్లుగా దీనిని రూపొం దించుట జరిగినది. ఇక ఆంగ్ల పదముల ఉచ్చారణనిస్తూ... ఆ పదముల ఉచ్చారణ విషయములో కూడ తగు జాగ్రత్తలను తీసికొనుట జరిగినది. ఉదాహరణకు... "Pain" అను పదమును "పెయిన్" అని, "Worm" అను పదమును- "వర్మ్" అని ఉచ్చరిస్తూ ఉంటారు. ఐతే... ఆంగ్లభాషా సంప్రదాయము ప్రకారము... 'Pain'ని- "పేన్" అనీ, "Worm" ని- "వెర్మ్" అని ఉచ్చరించవలసి ఉన్నది. ఈ విధముగా ఉచ్చారణ విషయములో ఆంగ్లభాషా నియమములను పాటించి... ఆంగ్లము రాని తెలుగు పాఠకులకు సైతము ఉపయోగపడునట్లుగా ఈ పుస్తకము కూర్చబడినది.

"ఈ పుస్తకము సామాన్యులకే గాక... వైద్యము నభ్యసించు విద్యార్థులకూ, పేరా మెడికల్ స్టూడెంట్స్‌కూ, మెడికల్ రిప్రజెంటేటివ్స్‌కూ, మెడికల్ షాప్స్ వారికీ, నర్సులకూ మరియు గ్రామ సీమలలో వైద్య సేవల నందించు R.M.P. (రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్), P.M.P. (ప్రైవేట్ మెడికల్ ప్రాక్టీషనర్)లకూ కూడ ఎంతగానో ఉపయోగ పడగలదనుటలో సందేహము లేదు"ని ఒక వైద్యునిగా విశ్వసిస్తున్నాను. ప్రస్తుతము ఇది చిన్ని పుస్తక మైనప్పటికీ... భవిష్యత్‌లో- 'Annexure (అనుబంధము)'లను పెంచుకుంటూ... ఒక పరిపూర్ణ గ్రంథముగా దీనిని తీర్చి దిద్దుటకు ప్రయత్నించగలను. నా వైజ్ఞానిక గ్రంథములను నా ఆశయము మేరకు పాఠక ప్రపంచమున కందిస్తున్న 'జనప్రియ పబ్లికేషన్స్' వ్యవస్థాపకుడు చిరంజీవి Y. వెంకటేశ్వరరావుకు- ప్రేమపూర్వ కాశీస్సులనిస్తూ... "హోమియో వైద్యము-I & II, సెక్స్ & హోమియో, మెడికల్ గైడ్, ప్రకృతి వైద్యము, ప్రథమ చికిత్స, వైద్య ప్రపంచము, ఆయిల్ పుల్లింగ్, అయస్కాంత చికిత్స, యోగశాస్త్రము"అను నా గ్రంథముల నాదరించిన పాఠక మిత్రులకు...... కృతజ్ఞతా పూర్వకముగా నమస్కరిస్తూ... సెలవు తీసికొనుచున్న.................................. మీ ..................

—డా॥ K.V.N.D. ప్రసాద్

# MEDICAL DICTIONARY
# (వైద్య నిఘంటువు)

## A

Abdomen (అబ్‌డొమెన్) : ఉదరము; ఛాతికి, పొత్తికడుపుకి మధ్యన గలట్టి భాగము.

Abdomen pendulous (అబ్‌డొమెన్ పెండ్యులస్) : బిగితగ్గిన కండరముల వలన పొత్తికడుపు మీదికి ఉదరము జాఋట.

Abdominalgia (అబ్‌డొమినాల్జియా) : కడుపు నొప్పి.

Abdominal respiration (అబ్‌డొమినల్ రెస్పిరేషన్) : శ్వాసవలన ఉదర కుహర కండరములు అధికముగా కదలుట.

Abort (అబోర్ట్) : వ్యాధిని అదుపుచేయుట.

Abscess (అబ్‌సెస్) : చీముపట్టిన పుండు.

Accommodation of the eye (అకామొడేషన్ ఆఫ్ ది ఐ) : దూరముగా, దగ్గరగా చూచుటకు అనుకూలమైన కంటిపాప అమరిక.

Accouchement (ఎకూష్‌మెంట్) : ప్రసవము; పురుడు పోయుట.

Accoucheur (ఎకూషర్); Obstetrician (ఒబ్‌స్టెట్రిషాన్) : మంత్రసాని పని చేయువాడు (నది).

Acetabulum (ఎసిటాబ్యులమ్) : తుంటి ఎముక నందు తొడ ఎముక యొక్క తలభాగము నందు ఉండే గిన్నెవంటి భాగము.

Aching pain (ఏకింగ్ పేన్) : దీర్ఘ కాలము ఉండే (అంతతీవ్రముకాని) ఎడతెగని నొప్పి.

Achilles tendon (అకిలెజ్ టెండన్) : కాలును (పిక్క కండరమును) మడమతో కలిపే స్నాయువు.

Achlorhydria (అక్లోర్‌హైడ్రియా) : జీర్ణ కోశములో ఉండవలసినంతగా హైడ్రో క్లోరిక్ అమ్లము లేకపోవుట.

Achondroplasia (అకొండ్రోప్లాసియ) : మఱుగుజ్జు.

Achromia (అక్రోమియా); vitiligo (విటిలిగో) : చర్మముపైన వచ్చు తెల్ల మచ్చలు (బొల్లి).

Acid (ఆసిడ్) : ఆమ్లము; పుల్లనిది; క్షారములకు వ్యతిరేకస్వభావము కలిగినట్టిది.

Acne (అక్నె) : చర్మములో ఉన్న క్రొవ్వు గ్రంథులు వాచి, చీము పట్టుట; పోత పొక్కులు.

Acne punctate (అక్నె పంక్‌టేట్) : యౌవన దశలో ముఖముపైన వచ్చే ఎఱ్ఱని పొక్కులు.

Acrid (అక్రిడ్); Biting (బైటింగ్); Corrosive (కొరోసివ్); Irritating (ఇరిటేటింగ్); Excoriating (ఎక్స్‌కొరియేటింగ్); Pungent (పంజంట్); Sharp (షార్ప్) : మంటగ ఉండు, పుండు కలిగించు.

Acupuncture (ఆక్యుపంక్చర్) : టిష్యూల లోనికి సూదులను గ్రుచ్చుట ద్వారా చేయు చికిత్స.

Acute disease (ఆక్యూట్ డిసీజ్) : తరుణ వ్యాధి; త్వరితమైన మార్పులతో ప్రాణాపాయ కరముగా పరిణమించు వ్యాధి.

Acute yellow atrophy of liver (ఆక్యూట్ ఎల్లో అట్రోఫి ఆఫ్ లివర్) : అపాయకరమైన కాలేయవ్యాధి; దీనివలన కామెర్లు, రక్తస్రావము, కోమావంటివి ఏర్పడి; చివరికి ఆ రోగి చనిపోవును.

Addison's disease (అడిసన్స్ డిసీజ్) : మూత్రపిండముల పైభాగపు గ్రంథులు పనిచేయక పోవుట వలన... శరీరము, అమత్వక్కులు కంచు రంగుగా మారి; రక్తపోటు తగ్గుట, నీరసము మొదలగు లక్షణములతో ఏర్పడు అపాయకరమైన వ్యాధి.

Adductor (అడక్టర్) : ముడుచుకొనుటకు ఉపయోగపడు కండరము.

Adenitis (అడెనిటిస్): Inflamation of the glands (ఇన్ఫ్లమేషన్ ఆఫ్ ది గ్లాండ్స్) : గ్రంథులు; సాధారణముగా... శోషరస గ్రంథులు వాచుట.

Adenoid cancer (అడెనోయిడ్ కేన్సర్); Adenocarcinoma (అడెనొకార్సినోమా) : గ్రంథుల యొక్క ధాతువునకు కలుగు ప్రమాదకరమైన కేన్సర్ లేక పుండు.

Adhesion (అడ్హెషన్) : వాపుటచేగాని, గాయము వలన గాని... రెండు ఉపరి భాగములు అస్వభావికముగా అంటుకొనుట (శస్త్రచికిత్స అనంతరము ఇట్టిది కలుగవచ్చును).

Adipose tissue (అడిపోస్ టిష్యూ) : క్రొవ్వు సంబంధమగు ధాతువు.

Adiposis (అడిపోసిస్) : క్రొవ్వు అధికముగా కూడుట.

Adjuvans (అడ్జువన్స్); Adjuvant (అడ్జువంట్) : సహాయక ఔషధము; అనుపానము.

Adolescence (అడాల్సెసెన్స్) : 12 సం॥ మొదలు 25 వ సం॥ము వఱకు గల వయస్సు; యౌవనము.

Adrenal glands (ఎడ్రెనాల్ గ్లాండ్స్) : మూత్రపిండములకు పై భాగములో ఉండు వినాళ గ్రంథులు.

Aerophagia (ఏరోఫేజియా) : గాలిని మింగుట; ఇందువలన... త్రేన్పులు కలుగును. హిస్టీరియాలో ఒక్కొక్కప్పుడు ఇలా జరుగవచ్చును.

Aetiology *or* Etiology (ఎటియోలజి) : వ్యాధి కారణములను తెలుపు శాస్త్రము.

Afebrile (అఫెబ్రిల్) : జ్వరము లేని స్థితి.

Affected parts (అఫెక్టెడ్‌పార్ట్స్) : వ్యాధిగ్రస్త భాగములు.

Afferent nerves (అఫెరెంట్ నెర్వెస్) : ఇంద్రియములనుండి మెదడుకు వార్తలను కొనిపోవు నాడులు.

Afflicted (అఫ్లిక్టెడ్) : బాధ వలన దుఃఖించుట.

Agalactia (అగలేక్టియా) : బాలింతలకు పాలులేకపోవుట లేక తక్కువగా ఉండుట.

Agenesia (అజెనేషియా) : నపుంసకత్వము; వంధ్యత్వము.

Aggravation (అగ్రెవేషన్) : రోగిబాధలు తీవ్రమగుట.

Agnail (అగ్నేల్); Hang-nail (హేంగ్-నేల్) : గోరు మొదటిలోనున్న చర్మము పొరలుపొరలుగా ఉడిపోయి, వాచుట.

Agranulo cytosis (అగ్రన్యులో సైటోసిస్); Malignant leukopenia (మాలిగ్నంట్ లుకోపేనియా) : అరుదైన అపాయకరమైన వ్యాధి. దీని వలన- ఎముకలలోని మూలుగ వ్యాధిగ్రస్త మగును. ఈ వ్యాధి సాధారణముగాను, ఆకస్మికముగాను కలుగును.

Ague (ఏగు); Intermittent fever (ఇంటర్‌మిటెంట్ ఫీవర్) : మలేరియా జ్వరము; చలిజ్వరము.

Ague-cake (ఏగు-కేక్) : మలేరియా (చలి) జ్వరము వలన స్ప్లీన్ (ప్లీహము) పెద్దదగుట.

Air-sickness (ఏర్-సిక్‌నెస్) : అలవాటు లేని విమాన ప్రయాణము చేయునపుడు త్వరితగమనము వలన, ప్రాణవాయువు తక్కువగుట వలన కలుగు- తలత్రిప్పు, వికారము, వాంతులు మొదలగు లక్షణములు.

Albumin (అల్బ్యూమిన్) : మాంస కృత్తులు గల పదార్థము; ఇది జంతువుల, మానవుల మరియు వృక్షముల యొక్క ధాతువులలో ఉండును.

Albuminuria (అల్బ్యూమినూరియా) : మూత్రములో అల్బ్యూమిన్ అధికముగా ఉండుట.

Alcoholic drinks (ఆల్కొహోలిక్ డ్రింక్స్); A.Liquors (ఆ॥లిక్కర్స్); A.Stimulants (ఆ॥స్టిమ్యులెంట్స్) : మద్య సంబంధమగు ఉత్తేజకరమైన పానీయములు.

Alimentary canal (అలిమెంటరీ కనాల్): నోటి నుండి గుదము వఱకు గల ఆహార నాళము; అన్నవాహిక.

Alimentary system (అలిమెంటరీ సిస్టెమ్) : అన్నవాహిక మరియు జీర్ణ ప్రక్రియకు సంబంధించిన అవయవములు.

Alive (అలైవ్) : జీవించియుండు; Sensation something alive in stomach (సెన్సేషన్ సమ్‌థింగ్ అలైవ్ ఇన్ స్టమక్) : కడుపులో- సజీవమైనది ఏదియో ఉన్నట్లు ఉండుట.

Alkaline (ఆల్కలిన్) : క్షార సంబంధమైన.

Allergy (ఎలర్జీ): Oversensitiveness (ఓవర్‌సెన్సిటివ్‌నెస్) : వ్యక్తి వైకల్యము; ఒక్కొక్కరికి - ఒక్కొక్క పదార్థము వలన లేక పరిస్థితి వలన కొన్ని బాధలు కలుగ వచ్చును. ఇట్లు బాధ కలిగించు పదార్థమును లేక పరిస్థితిని "Allergen (ఎలెర్జిన్)" అందురు. దీనివలన చర్మము మీద దురదతో కూడిన తట్టు, దద్దురులు, గజ్జి, హేజ్వరము, ఉబ్బసము మొ॥గు బాధలు కలుగవచ్చును.

Allopathy (అల్లోపతి) : రోగికిగల లక్షణములకు- వ్యతిరేక లక్షణములను కలిగించెడి మందులను వాడి చికిత్స చేయు విధానము.

Alopecia (అలోపేసియా); Baldness (బాల్డ్‌నెస్); Hair falling (హేర్ ఫాలింగ్): వెంట్రుకలు రాలుట వలన బట్టతల ఏర్పడుట.

Alterative (ఆల్టరేటివ్) : శరీర మందలి ఏదేని ఒక అవయవము సరిగా పని చేయకపోయినప్పుడు గాని, తిన్నది శరీరమునకు సరిగా ఒంటబట్టనపుడు గాని చక్కబఱచునది.

Alveolar (ఆల్‌వియొలర్) : వాయు గోళములకు చెందిన; దవుడ ఎముకకు చెందిన.

Alveolitis (ఆల్‌వియొలిటిస్) : చిగుళ్ళు వాచుట; ఇవి వాచి చీముపట్టుట.

Amative (అమెటివ్); amativeness (అమెటివ్‌నెస్) : శృంగారము లేదా జననేంద్రియ సంబంధమగు ప్రేమ.

Ambulance (అంబ్యులన్స్) : జబ్బుచేసిన వారిని గాని, గాయపడిన వారిని గాని వైద్యశాలలకు గొనిపోవు వాహనము.

Amelioration (అమెలియొరేషన్) : ఉపశమనము; ఉపశాంతి.

Amenorrhoea (అమెనోరియా) : ఋతుస్రావము (ముట్టు) ఆగిపోవుట.

Amniotic sac (అమ్నియోటిక్ సాక్); Bag of waters (బ్యాగ్ ఆఫ్ వాటర్స్): గర్భవతియొక్క గర్భకోశమందు శిశువు ఉండెడి తిత్తి.

Amorous lewdness (అమోరస్ ల్యూడ్ నెస్); Lascivious (లాస్కివియస్) : కామము; ఇంద్రియ సంబంధమగు ప్రేమ.

Amphiarthrosis (ఆమ్ఫియర్థ్రోసిస్) : వెన్నుపూసల వంటి జాతెడి కీళ్ళు.

Ampule (ఆమ్పుల్) : ఇంజెక్షన్ చేయుటకు వాడు మందు ఉండు గాజు గొట్టము.

Amputation (ఆంప్యుటేషన్) : కాలు-చేయి మున్నగు అవయవములను శరీరము నుండి వేఱు చేయుట.

Amygdalitis (అమిగ్డలిటిస్) : టాన్సిల్స్ వాపు.

Amyloid lardaceous (అమిలాయిడ్ లార్డేసియస్) : ముఖ్యముగా కాలేయము, మూత్రపిండముల ధాతువులు పిండి పదార్థముగ మాఱునట్టి వ్యాధి.

Anaemia *or* Anemia (అనేమియా) : రక్తక్షీణత; పాండురోగము; రక్తములో ఎఱ్ఱకణములు, హెమోగ్లోబిన్ తక్కువగా ఉండుట. దీనివలన చర్మము పాలిపోయి-ఆయాసము, గుండెదడ మున్నగునవి కలుగ వచ్చును.

Anaemia pernicious (అనేమియా పెర్నిషస్) : పోషకశక్తి తక్కువగుటచే కలుగు వ్యాధి.

Anaesthesia *or* anesthesia (ఎనస్తీజియా): బాధ, స్పర్శ వంటివి తెలియక పోవుట.

Anal canal (ఏనల్ కెనాల్) : పురీషవాళపు క్రింది భాగము.

Analgesic (అనాల్జెసిక్); Pain-killer (పేన్-కిల్లర్) : నొప్పిని తగ్గించుమందు.

Anaphrodisiac (అనాఫ్రొడైజియాక్) : జననేంద్రియ వాంఛను తగ్గించునది.

Anatomy (అనాటమి) : శరీర నిర్మాణ శాస్త్రము.

Anchylosis *or* Ankylosis (అంకిలోసిస్): కీలు బిఱ్ఱబిగియుట.

Anchylostomum duodenele (అంకిలోస్టోమమ్ డ్యూయోడెనాల్) : ప్రేగులలో కొంకిపురుగులు చేరుటవలన కలుగు వ్యాధి. దీనివలన ప్రాణాపాయ ముయును ఏర్పడవచ్చును.

Androphobia (ఆండ్రోఫోబియా) : పురుషుల యెడ అయిష్టత లేదా భయము.

Anesthesiology (ఎనెస్తీజియాలజీ) : శస్త్రచికిత్సయందు ఉపశాఖ. రోగిని శస్త్రచికిత్సకు తయారు చేయుటను గుఱించి తెలుపు ప్రత్యేక శాస్త్రము.

Aneurism *or* Aneurysm (అన్యూరిజ్మ్): ధమనిగాని, సిరగాని విపులీకరించుటచే కలుగు- మెత్తని కంతి.

Angina (ఆంజినా) : పదే పదే ఊపిరి ఆడనీయని స్థితి.

Anguish (ఆంగ్విష్) : తీవ్రమైన మానసిక బాధ.

Ankylostomiasis (ఆంకిలోస్టోమియాసిస్); Hookworm disease (హుక్-వెర్మ్ డిసీజ్) : కొంకిపురుగు వ్యాధి.

Anodyne (అనొడైన్); Analgesic (అనాల్జెసిక్) : నొప్పిని పోగొట్టు మందు.

Anoxemia (అనాక్సెమియా) : రక్తములో ప్రాణవాయువు చాల తక్కువగా ఉండుట.

Ante-flexion (అంటే-ఫ్లెక్షన్); Bent forward (బెంట్ ఫార్వర్డ్) : స్త్రీ గర్భకోశము ముందుకు వంగుట.

Ante-natal (అంటె-నటల్) : గర్భధారణ మొదలు, ప్రసవము వఱకు గల 40 వారముల వ్యవధి.

Antepartum heamorrhage (ఆంటె-పార్టమ్ హెమొరేజ్) : ప్రసవమునకు ముందు గర్భకోశము నుండి రక్తస్రావము జరుగుట.

Anterior chamber (ఆంటీరియర్ ఛాంబర్) : కంటిలోని కార్నియాకి, ఐరిస్‌కి మధ్యన గల భాగము.

Anterior poliomyelitis (ఆంటీరియర్ పాలిమైలిటిస్); Infantile paralysis (ఇన్‌ఫాంటైల్ పెరాలిసిస్) : బాల్యదశ నందు ఏర్పడు పక్షవాతము.

Anthelmintic (ఆంథెల్‌మిన్‌టిక్) : ప్రేగు లందలి క్రిములను పోగొట్టు లేదా నశింప జేయు మందు. Vermifuge (వెర్మి-ఫ్యూజ్).

Anthony's fire (ఆంథోనీస్ ఫైర్); Erysipelas (ఎరీసిపెలస్) : సర్పి.

Anthrax carbuncle (ఏంథ్రాక్స్ కార్బంకిల్) : రాచపుండు; అపాయకరమగు సెగగడ్డ. ఏంథ్రాక్స్ సూక్ష్మక్రిముల వలన-జంతువులకు, మానవులకు కలుగు వ్యాధి.

Anthropology (ఆంత్రపోలజీ) : మానవుని స్వభావమును తెలుపు శాస్త్రము.

Anthropophobia (ఆంత్రోపోఫోబియా) : మనుష్యులతో ఉండుటకు భయము.

Antibiotics (ఆంటిబయోటిక్స్) : శరీరము లోని సూక్ష్మక్రిములను నశింపజేయు పెనిసిలిన్, స్ట్రెప్టోమైసిన్, ఆరియోమైసిన్, టెర్రామైసిన్,ఎక్రొమైసిన్, క్లోరామ్ ఫెనికాల్ మొ॥గు మందులు.

Antibodies (ఆంటిబాడీస్) : సూక్ష్మ క్రిములను నాశనము చేసి, విషములను తటస్థీకరణ మొనర్చు (శరీరము లోపల ఉత్పత్తి అగు) పదార్థములు.

Antidote (ఆంటిడోట్) : విషము యొక్క ఫలితములను పోగొట్టే విఱుగుడు.

Antifebrile (ఆంటిఫెబ్రిల్) : జ్వరమును పోగొట్టునది.

Antigen (ఆంటిజెన్) : శరీరములోగాని, వెలుపలగాని Antibodies ను ఏర్పడు నట్లుచేసి, వాటి ఎడల ప్రతిక్రియ చూపు పదార్థములు.

Antihaemorrhagic (ఆంటిహెమరేజిక్): రక్తస్రావమును ఆపు చేయునది.

Anthistamine (ఆంటిస్టమైన్) : శరీరము లోని జంతు, వృక్ష సంబంధమగు ధాతువుల యందలి రసాయన ఫలితమును పోగొట్టు పదార్థము.

Antiparasitic (ఆంటిపారసైటిక్) : శరీర మందలి క్రిములను నశింపజేయునది.

Antiphlogistic (ఆంటిఫ్లోజిస్‌టిక్) : వాపును తగ్గించునది.

Antipsoric (ఆంటిసోరిక్) : "సోరా" అను దీర్ఘవ్యాధి కారకమును నిర్మూలించు మందు.

Antipyretic (ఆంటిపైరెటిక్) : జర్వమును తగ్గించునది.

Antiseptics (ఆంటిసెప్‌టిక్స్) : వ్యాధిని కలిగించు సూక్ష్మక్రిములను వృద్ధికాకుండ చేయునవి.

Antispasmodic (ఆంటిపాస్‌మొడిక్) : కంపము, శూలను తగ్గించునది.

Antisycotic (ఆంటిసైకొటిక్) : "సైకొసిస్ (సెగ)" అను దీర్ఘవ్యాధి కారకమును నిర్మూలించునది.

Antisyphilitic (ఆంటిసిఫిలిటిక్) : సిఫిలిస్ (సవాయి)' వ్యాధి కారకమును నిర్మూలించునది.

Antitragus (ఆంటిట్రాగస్) : వెలుపలి చెవి.

Antrum (ఆంట్రమ్) : ఎముకయందుండు గుల్ల ప్రదేశము.

Antrum of highmore (అంట్రమ్ ఆఫ్ హైమోర్) : పై దవుడ ఎముకయందలి గుల్ల ప్రదేశము.

Anuria (అనూరియా) : మూత్రోత్పత్తి లేకపోవుట.

Anvil (అన్విల్) : మధ్య చెవియందలి ఒక చిన్న ఎముక.

Apex of the heart (ఎపెక్స్ ఆఫ్ ది హార్ట్): గుండె అడుగుకొన.

Aphasia (అఫేజియా) : భావములను తెలుపలేకపోవుట; మాట్లాడిన దానిని అర్థము చేసికోలేకపోవుట.

Aphonia (అఫోనియా) : స్వరముపోవుట, Hoarseness (హోర్స్నెస్).

Aphrodisiac (అఫ్రోడిసియాక్) : రతి వాంఛను రేకెత్తించు మందు.

Aphthae (అఫ్థయె) : నోరు, నాలుక, జననేంద్రియముల యందు కలుగు తెల్లని చిన్న పుండ్లు. Trush (త్రష్).

Aphthous (అఫ్థస్) : నోరు మొ॥గు ఆమత్వక్కులందు తెల్లని చిన్న పుండ్లు.

Apnoea (అప్నోయ్) : స్వల్ప కాలము శ్వాస ఆగుచుండుట.

Appendicectomy (అపెండిసెక్టొమీ) : అపెండిక్స్‌ను శస్త్రచికిత్స చేసి తీసివేయుట.

Appetite (ఎపిటైట్) : ఆకలి.

Aqua distillata (ఆక్వా డిస్టిలేటా) : స్రవణోదకము; బట్టీ పట్టిన నీరు; Distilled water (డిస్టిల్డ్ వాటర్).

Arachnoid membrance (ఆరక్నాయిడ్ మెంబ్రేన్స్) : మెదడు, వెన్నుపాములను చుట్టియుండే మూడు పొరలలో మధ్యది.

Arachnoidism (ఆరక్నాయ్‌డిజ్మ్) : సాలీడు కఱచినందున కలుగు విష ఫలితములు.

Arcus senilis (అర్కస్ సెనిలిస్) : వయోధికులలో నల్లగుడ్డు (ఐరిస్) అంచువద్ద ఏర్పడు అపారదర్శక వలయము.

Arrested respiration (అరెస్టెడ్ రెస్పిరేషన్) : శ్వాస బంధింపబడుట (ఆగిపోవుట).

Arrhythmia (అరిథ్మియా) : గుండె క్రమము తప్పి కొట్టుకొనుట.

Arsenical poisioning (ఆర్సెనికల్ పాయిజనింగ్): పాషాణ విషఫలితములు.

Arterio-sclerosis (ఆర్టెరియో-స్క్లెరోసిస్): ధమనుల మధ్య పొరలయందు సున్నపు లవణములు కూడి, గోడలు గట్టిబడే వ్యాధి. ఇందువలన రక్తపోటు హెచ్చుట, గుండె జబ్బు, రుద్రవాతము మొ॥నవి కలుగును.

Artery (ఆర్టెరీ) : ధమని; గుండెనుండి రక్తమును గొనిపోవు రక్తనాళము.

Artery pulmonary (ఆర్టెరీ పల్మొనరీ): పుపుస ధమని; గుండెనుండి ఊపిరి తిత్తులకు పోవు రక్తనాళము.

Arteritis (ఆర్టెరైటిస్) : ధమని వాపు.

Arthralgia (ఆర్థ్రాల్జియా) : కీలునొప్పి, కీళ్ళవాతము, గౌట్.

Arthritis (ఆర్థ్రైటిస్) : Gout (గౌట్), Rheumatism (రుమాటిజ్మ్) మొ॥గు వ్యాధుల వలన వచ్చు కీళ్ళవాపు.

Articular rheumatism (ఆర్టిక్యులర్ రుమాటిజ్మ్) : కీళ్ళు వాచునట్టి వాతము.

Artificial insemination (ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్) : కృత్రిమ పద్ధతిలో వీర్యమును-యోనిలోనికి పంపుట. Test-tube baby (టెస్ట్ ట్యూబ్ బేబీ) ఈ ప్రక్రియతో కూడినదే.

Ascaridea (అస్కారిడెయా) : ప్రేగులందలి ఏలికపాములు, నులి పురుగులు మొ॥గు క్రిములు.

Ascorbic acid (అస్కార్బిక్ ఏసిడ్) : 'సి' విటమిన్.

Aspermatism (అస్పెర్మాటిజ్మ్) : శుక్రోత్పత్తి లేకపోవుట.

Asphyxia (అస్ఫిక్సియా); Asphixy (అస్ఫిక్సి) : ఊపిరి ఆడకపోవుట; శ్వాస ఆగిపోవుట.

Asphyxia neonatorum (అస్ఫిక్సియా నియొనేటొరమ్) : జనించిన శిశువుకు శ్వాస ఆగిపోవుట.

Asthma bronchial (ఆస్తమా బ్రాంకియల్) : శ్వాసనాళ కండరముల ఈడ్పుచే కలుగు ఉబ్బసము.

Asthma cardiac (ఆస్తమా కార్డియాక్) : గుండెజబ్బుచే కలుగు ఆయాసము.

Asthma Catarrhal (ఆస్తమా కాటరాల్) : జలుబుతో కూడిన ఉబ్బసము.

Asthma hay (ఆస్తమా హే); Hay fever (హే ఫీవర్) : ఒక్కొక్క కాలమందు జలుబు, తుమ్ములు కలుగుచుండుట.

Asthma humid (ఆస్తమా హ్యూమిడ్) : శ్లేష్మము (కళ్ళె) తో కూడిన ఉబ్బసము.

Asthma nervous (ఆస్తమా నెర్వస్) : నాడీమండల ఉద్రేకము వలన కలుగు ఉబ్బసము.

Asthma spasmodic (ఆస్తమా స్పాస్మాడిక్) : ఉధృతములు పార్లుపార్లుగ కలుగు ఉబ్బసము.

Asthma thymicum (ఆస్తమా థైమికమ్) : థైమస్‌గ్రంథి పెద్దదగుటచే కలుగు ఆయాసము.

Astringent (ఆస్ట్రిన్‌జెంట్) : నాళములను దగ్గఱకు ముడుచుకొనునట్లు చేసి, స్రావములను ఆపుచేయునది; వగరు.

Ataxia (అటాక్సియా); Ataxy (అటాక్సీ) : కండరముల పని సమన్వయముగా ఉండక రోగి తూలుచూ, ఊగుచూ నడచును.

Atelectasis (అటెలెక్టసిస్) : ఊపిరితిత్తుల లోని గాలి గోళములు సరిగా పనిచేయక పోవుట; Collapse of the lungs (కొలాప్స్ ఆఫ్ ది లంగ్స్).

Atheroma (అథెరోమా) : ధమనుల లోపలి వైపున పచ్చని గట్టి పదార్థమేర్పడుటతో రక్తపుపోటు హెచ్చుట.

Atherosclerosis (అథెరోస్క్లెరోసిస్) : ధమని లోపలిపొరలలో క్రొవ్వుపదార్థములు నిలువ యుండి, గట్టి పడుట; గుండె జబ్బులకు ముందు ఇట్లు ఏర్పడును.

Athetosis (అథెటోసిస్) : కాళ్ళు, చేతులు నిత్యము కదుపు చుండుట.

Atria (అట్రియా); Atriums (అట్రిమ్స్); Auricles (ఆరికిల్స్) : కర్ణికలు; గుండె లోని పై పొరలు.

Atrophy of the heart (అట్రొఫీ ఆఫ్ ది హార్ట్) : గుండె పరిమాణము మరియు బరువు తగ్గుట.

Attenuation (అటెన్యుయేషన్); Dilution (డైల్యూషన్); Dynamization (డైనమైజేషన్); Potency (పొటెన్సీ) : ఒక భాగము మందుకు 10 లేక 100 భాగముల పాలు, పంచదార, నీరు లేదా ఆల్కొహాల్ కలిపి... కొంతసేపు నూఱుటచేగాని, కొన్ని సారులు కుదుపుటచే గాని మరుసటి పొటెన్సీలోకి ఆ మందు మార్చబడును.

Auditory nerves (ఆడిటరీ నెర్వ్స్) : వినికిడికి సంబంధించిన నరములు.

Aura epileptica (ఆరా ఎపిలెప్టికా) : మూర్ఛ కలుగుముందు రోగికి తెలియు చిహ్నము.

Auris (ఆరిస్) : చెవులు.

Ausculation (ఆస్క్యులేషన్) : గుండెను, ఊపిరితిత్తులను, గర్భవతి ఉదరమును-స్టెతస్కోప్‌తోగాని, వాటిపై చెవిపెట్టిగాని పరీక్షించుట.

Autoeroticism (ఆటొయెరోటిసిజ్మ్); Autoerotism (ఆటొయెరోటిజ్మ్) : హస్తప్రయోగము. Masturbation (మాస్టర్‌బేషన్).

Autointoxication (ఆటో ఇంటాక్సికేషన్) : శరీరములో పనికిమాలిన పదార్థములు లేదా గాంగ్రేస్ మొ॥గు వాటిచే మృతినొందిన పదార్థములు శరీరమందు విలీనమగుటచే కలుగు పరిణామము.

Autopsy (అటాప్సీ); Necropsy (నెక్రోప్సీ); Postmortem (పోస్ట్‌మార్టెమ్) : శవపరీక్ష

Avitaminosis (అవిటమినోసిస్) : విటమిన్‌లు తక్కువగుటవలన కలుగు వ్యాధి స్థితి.

Axillary glands (ఏక్జిలరీ గ్లాండ్స్) : చంకకు చెందిన గ్రంథులు.

Axix (ఏక్సిస్) : వెన్నుపాము నందలి 2వ పూస.

Azoospermism (అజూస్పెర్మిజ్మ్) : రతి యందు స్ఖలనమగునుకాని, అందు శుక్ర కణములు ఉండవు.

Azoturia (అజోతురియా) : మూత్రములో యూరియా అధికముగా ఉండుట.

## B

Babbling (బాబ్లింగ్) : అర్థము-పర్థము లేకుండా వాగుచుండుట.

Back (బ్యాక్) : వీపు; పృష్ఠము.

Balanitis (బాలనిటిస్) : పురుషులలో 'గ్లాన్స్ (శిశ్నాగ్రభాగము)' గాని, దానిని కప్పెడి చర్మముగాని; స్త్రీలలో క్లిటోరిస్ (యోనిశీర్షము) యొక్క చివరిభాగము గాని వాచుట.

Bandage (బ్యాండేజ్) : గాజ్ గుడ్డతో కట్టు కట్టుట.

Bearing down (బేరింగ్ డౌన్) : కటి ప్రదేశమందు బరువుగా ఉండి, క్రిందకు లాగుచుండుట.

Beating pain (బీటింగ్ పేన్); Pulsating pain (పల్సేటింగ్ పేన్) : కొట్టు చున్నట్లుండు నొప్పి.

Bedsores (బెడ్ సోరెస్); Decubitus ulcer (డెక్యుబిటస్ అల్సర్) : దీర్ఘకాలము శయ్యాగతుడైన రోగికి కలుగు పడక పుండ్లు.

Bifida-spina (బైఫిడ-స్పైనా) : వెన్నుపాము నందలి నరములు త్రోసుకువచ్చి కంతి వలె ఏర్పడుట.

Bile (బైల్) : పైత్యరసము.

Bilious fever (బైలియస్ ఫీవర్) : పైత్య జ్వరము.

Birth-marks (బర్త్‌మార్క్స్); naevus (నేవస్) : పుట్టుమచ్చలు; Moles (మోల్స్).

Bleeding Hemorrhage (బ్లీడింగ్ హెమొరేజ్) : శరీరములోని ఏ భాగము నుండైనా అత్యధిక రక్తము స్రవించుట.

Belnorrhagia (బెల్నోర్‌హాగియ); Belnorrhoea gonorrhoea (బెల్నోరియా గనోరియ) : ఆమత్వక్కుల నుండి ఆమము (కళ్ళె మొ॥వి) అధికముగా స్రవించుట; స్త్రీ యోనినుండి ఆమము అధికముగ స్రవించుట; సెగ.

Blindness (బ్లైండ్‌నెస్) : అంధత్వము.

Blinking (బ్లింకింగ్) : కనురెప్పపాటు అప్రయత్నముగా ఉండుట; కన్నులు సగము మూసికొని చూచుట.

Bilstered (బ్లిస్టర్డ్) : బొబ్బలు ఎక్కిన; పొక్కెక్కిన.

Bloated (బ్లోటెడ్); Swelling (స్వెల్లింగ్) : ఉబ్బుట; పొంగుట.

Blood (బ్లడ్) : రక్తము; నెత్తురు.

Blotches (బ్లోచెస్) : పెద్దమచ్చలు; చెమట పొక్కులు; చీము పొక్కులు.

Blurred vision (బ్లర్డ్ విజన్) : అస్పష్టముగ, అలుకుకుపోయినట్లు కనబడుట.

Boil (బాయిల్); Furuncle (ఫ్యురంకిల్) : సెగగడ్డ వాచి చీము కాఱు కుఱుపు.

Boiling sensation (బాయ్‌లింగ్ సెన్-సేషన్) : మరుగు (ఉడుకు) చున్నట్లు బాధ.

Borborygmi (బార్బొరిగ్మి); Borborygmus (బార్బొరిగ్మస్); Flatulence (ఫ్లాచ్యులెన్స్) : ఉదరములో వాయువుచే కలుగు గుడగుడ శబ్దము.

Bran-like (బ్రాన్-లైక్); Scaly (స్కేలీ); Scurfy (స్కర్ఫై); Furfuraceous (ఫర్ఫ్యురేసియస్) : ఊకవంటి, పొలుసు వంటి.

Breath (బ్రీత్) : శ్వాస, ఊపిరి.

Breathing (బ్రీతింగ్); Respiration (రెస్పిరేషన్) : శ్వాసించుట; ఊపిరిపీల్చుట.

Bright's disease (బ్రైట్స్ డిసీజ్); Nephritis (నెఫ్రిటిస్) : మూత్రపిండ ముల వాపు; ఇందు మూత్రముతో పాటు ఆల్బ్యుమిన్ పోవుచూ... సాధారణముగ ఒంటికి నీరు పట్టును.

Bronchial affections (బ్రాంకియల్ అఫెక్షన్స్) : శ్వాసనాళ వ్యాధులు.

Brooding (బ్రూడింగ్) : విచారముగ ఒకే విషయమును తలపోయుచుండుట.

Bruise (బ్రూయిస్); Contusion (కన్ట్యూషన్) : దెబ్బతగిలి, చర్మము కమిలి నల్ల బడుట.

Bubbling pain (బబ్లింగ్ పేన్) : మరుగు చున్నట్లుండు బాధ.

Bubo (బ్యూబో) : గజ్జలలో గాని, చంకలలో గాని శోషరసగ్రంథులు వాచి, పెద్దవగుట; ఇవి సుఖవ్యాధుల వలనగాని, ప్లేగ్‌వ్యాధిచే గాని ఏర్పడును.

Bunion (బనియన్) : పాదమందలి కీళ్ళ వద్ద ముఖ్యముగా బొటనవ్రేలి కీళ్ళ వద్ద రాపిడి కలుగకుండ ఉండు ద్రవపు తిత్తి (Bursa = బర్సా) వాచి దుర్భరమైన బాధ కలుగుట.

Burning pain (బర్నింగ్ పేన్) : మండు చున్నట్లు లేక కాలుచున్నట్లు ఉండు నొప్పి.

Buzzing pain (బజ్జింగ్ పేన్) : తేనెటీగలు కుట్టుచున్నట్లు నొప్పి.



Cachexia (కేకెక్సియా); Cachexy (కేకెక్సి) : అపాయకరమైన వ్యాధిచే అధికముగా బరువు కోల్పోవుట.

Calculi *or* Calculuses (కాలిక్యులి ఆర్ కాల్‌క్యులుసెస్); Stones (స్టోన్స్); Gravel (గ్రావెల్) : శరీరమునందు ఏర్పడిన ఱాయి వంటి పదార్థము.

Callosity (కలోసిటి) : రాపిడిచే అఱచేతులు బిఱుసెక్కి, మొద్దు బారుట.

Callous skin (కాలస్ స్కిన్); Hard skin (హార్డ్ స్కిన్) : అధిక పరిశ్రమ వలన బిఱుసెక్కిన చర్మము.

Cancerous affections (కేన్సరస్ ఎఫెక్షన్స్) : కేన్సర్ సంబంధమగు వ్యాధులు.

Cancrum oris (కేన్‌క్రమ్ ఓరిస్); Canker of the mouth (కేన్‌కర్ ఆఫ్ ది మౌత్); Noma (నోమా) : నోటియందలి ధాతువులు కుళ్ళునట్టి ఆపాయకరమగు పుండు. Stomacace (స్టమకేస్).

Canthi (కేన్‌థి); Canthus (కేంథస్) : కనుఱెప్పలు కలియు మూల. కంటి యొక్క లోపలి లేక వెలుపలి కొలికి.

Capillary (కేపిల్లరీ) : కేశనాళిక; శరీర మందలి అతి సూక్ష్మ రక్తనాళము.

Caries of bone; Caries of teeth (కేరిస్ ఆఫ్ బోన్; కేరిస్ ఆఫ్ టీత్) : ఎముక పుండు; పుప్పిపన్ను.

Carphologia (కార్ఫోలోజియా); Carphology (కార్ఫోలజీ) : సంధి స్థితిలో పక్కబట్టలను పీకుచుండుట.

Cartilage (కార్టిలాగ్); Gristle (గ్రిస్టిల్) : మృదులాస్థి, ఉపాస్థి.

Cartilaginous (కార్టిలాజినస్) : మృదులాస్థి సంబంధమగు.

Catalepsy (కేటలెప్సి); Trance (ట్రాన్స్) : ఆకస్మికముగా మాటలేకుండా కండరములు కొయ్యబారిపోవు వ్యాధి.

Cataract (కేటరాక్ట్) : కంటిలోని లెన్స్ (కటకము)నకు పారదర్శకత్వము క్రమేపి పోవుట వలన తెరలో చూచునట్లుండుట.

Catarrh (కేటర్) : గొంతు, నాసిక, శ్వాస నాళముల ఆమత్వక్కు వాపు, రొంప; పడిసెము; జలుబు.

Catarrhal fever (కేటరాల్ ఫీవర్) : జలుబుచే కలిగిన జ్వరము.

Catching respiration (కేచింగ్ రెస్పిరేషన్) : పట్టివేయుచుండు శ్వాస.

Cauliflower excrescene (కాలిఫ్లవర్ ఎక్స్‌క్రెసెన్స్) : కాలిఫ్లవర్ వలే ఉబ్బెత్తుగా మాంసము పెరుగుట.

Cephalhaematoma (సెఫాల్ హెమటోమా) : అప్పుడే పుట్టిన బిడ్డ తలపై కలిగిన రక్తపు కంతి; కపాల చర్మము క్రింద నుండు రక్తము గడ్డకట్టుట.

Cerebral haemorrhage (సెరెబ్రల్ హెమరేజ్) : మెదడునందు కలుగు రక్త స్రావము.

Cerebro-spinal (సెరెబ్రో-స్పైనల్) : మెదడుకు, వెన్నుపాముకు సంబంధించినది.

Cervical canal (సెర్వికల్ కనాల్) : స్త్రీ గర్భకోశపు మెడద్వారము నుండి గర్భకోశము వఱకు గల రంధ్రము లేక కాలువ.

Chapped [Hands] (చాప్డ్) [హ్యాండ్స్]: బీటలు వారిన, పగుళ్ళుగల (హస్తములు).

Chemosis (కెమోసిస్) : కంటిముందు భాగపు ఆమత్వక్కు వాచుట.

Chicken-pox (చికెన్-పాక్స్) : ఆటలమ్మ; చిన్నమ్మవారు; అంతగా అపాయకారి కాదు. Varicella (వరిసెల్లా).

Chilblain (చిల్‌బ్లేన్) : అతిశీతలముచే చర్మము ఎఱుపెక్కి, వాచి, తీవ్రమగు దురదలతో పాటు..., పొక్కులు గాని, బొబ్బలు గాని లేచి, పుండు పడుట.

Chlorosis (క్లోరోసిస్) : ఒక రకమగు రక్త క్షీణత. ఇది ఎక్కువగా యువతులలో కలుగును. ముట్లు ఆగిపోయి, నీరసించి; ఆకలిగాని, జీర్ణశక్తిగాని ఉండవు. Green sickness (గ్రీన్ సిక్‌నెస్).

Choking (చోకింగ్) : ఊపిరి ఆడకుండ చేయు.

Cholera (కలరా) : వాంతులు, విరేచనములతో ఒళ్ళు చల్లబడు ప్రాణాంతక వ్యాధి. కలరా.

Chordee (కోర్డీ) : గనోరియా వ్యాధిగ్రస్తుల శిశ్నము ఉద్రేకము చెందినపుడు-క్రిందికి వంగిపోయి, తీవ్ర బాధను కలిగించుట.

Chorea (కొరియా) : కండరములు అప్రయత్నముగా అదురుచుండు నాడీ మండల వ్యాధి.

Chronic (క్రానిక్) : దీర్ఘకాలము నుండి ఉన్నది.

Cicatrix (సికాట్రిక్స్) : పుండు లేక గాయము మాను సమయములో ఏర్పడు నూతన కండరము.

Cirrhosis (సిర్‌హోసిస్) : అవయవము గట్టిపడి, పరిమాణము తగ్గుట.

Clavicle (క్లవికల్) : భుజపు ఎముక; Collar bone (కాలర్ బోన్).

Clawing pain (క్లాయింగ్ పేన్) : పక్షిగాని, పిల్లిగాని, పులిగాని గోళ్ళతో గీకుచున్నట్లు నొప్పి.

Clenched jaw (క్లెన్చ్డ్ జా) : దవుడలు గట్టిగా మూసికొని పోవుట.

Coated [tongue, throat etc.] (కోటెడ్) [టంగ్, త్రోట్ వగైరా] : పైన పూతవలె మలినపదార్థ ముండుట.

Cob-web sensation (కాబ్-వెబ్ సెన్సేషన్) : సాలెగూడు (బూజు, కరిధూపము) ఉన్నట్లు ఉండుట.

Coition (కోయిషన్); Coitus (కోయిటస్); Copulation (కోప్యులేషన్) : రతి; సంభోగము; స్త్రీ పురుష జననేంద్రియ ముల కలయిక.

Cold (కోల్డ్) : జలుబు.

Colc (కొలిక్) : శూల, ఉదరకుహరమందు కలుగు తీవ్రమగు నొప్పి.

Collapse (కొలాప్స్) : శారీరక లేక నాడీ మండల నిస్త్రాణతో శరీరోష్ణము బాగా తగ్గిపోయి, అపాయకర పరిస్థితి ఏర్పడుట.

Colliquative (కొలిక్వేటివ్) : తీవ్రముగా నిస్త్రాణ కలిగించు.

Comatosé (కొమటోస్) : మగత స్థితిలో నుండు;'కోమా(coma)' స్థితిలోనుండు.

Comedo (కొమెడో) : చర్మముపై చిన్న నల్లని పక్కుకట్టిన మచ్చలు.

Concretion (కాంక్రెషన్) : శరీరమందు గట్టి ఱాయివంటి పదార్థమేర్పడుట. A calculus (ఎ కాల్క్యులస్).

Concussion of brain or spine (కంకషన్ ఆఫ్ బ్రేన్ ఆర్ స్పైన్) : మెదడుకు గాని, వెన్నుపాముకుగాని కలుగు అదురుపాటు.

Concussive cough (కంకసివ్ కాఫ్) : అమిత బాధాకరమగు దగ్గు.

Condylomata (కన్డైలోమట) : తేమగనుండు సురుగుడు (పులిపిరి) కాయల వంటి లేదా కంతివంటి ఉబ్బెత్తుగనుండు ఎదుగుదలలు.

Congestion (కంజెషన్) : శరీరములో ఏ భాగమందైనను రక్తము అధికముగ కూడుట. ఊపిరితిత్తులందు శ్లేష్మము (ఆమము) అధికముగ నుండుట.

Congestive chill (కంజెస్టివ్ చిల్) : రక్త ప్రసరణాధిక్యతచే కలుగు చలి.

Conical cornea (కానికల్ కార్నియా) : కంటిలోని "కార్నియా" అను భాగము కోసుగ నుండుట.

Consciousness (కాన్షస్‌నెస్) : స్పృహతో నుండుట.

Constant (కాన్‌స్టెంట్) : మార్పులేకుండా స్థిరముగా నుండుట.

Constringing (కాన్‌స్ట్రింజింగ్): దగ్గఱకు నొక్కివేయుచుండునట్టి; గట్టిగ పిండునట్టి Constricting (కన్‌స్ట్రిక్టింగ్).

Contentious (కంటెన్షియస్) : కలహ ప్రియత్వము.

Continued fever (కంటిన్యూడ్ ఫీవర్) : శారీరక వేడిమి క్రమక్రమముగా హెచ్చుచు ఎడతెగకుండ వుండే జ్వరము.

Contraction (కంట్రాక్షన్) : ఒక కండరము గాని, కొన్ని కండరములుగాని తాత్కాలికముగా కొద్ది క్షణములు ముడుచుకొనుట.

Convulsions (కన్వల్షన్స్) : పార్లు; జన్ని; కంపములు. ఇచ్ఛాధీన కండరములు శరీరమంతటగాని; ఒక భాగమందుగాని-దగ్గఱకు ముడుచుకుపోవుచు, పట్టువదలు చుండుటచే... ఆ భాగములందు ఉధృతముగ కలుగుచుండు కంపములు.

Convulsive movements (కన్వల్సివ్ మూవ్‌మెంట్స్) : పారి లేక కంపముకు సంబంధించిన కదలికలు.

Cord (కార్డ్) : త్రాడు వంటిది: దారము వంటిది.

Corn (కార్న్); Clavus (క్లావస్); Collosities (కలోసిటీస్) : రాపిడి వలన గాని, ఒత్తిడి వలనగాని (పాదములు కాలి వ్రేళ్ళ మీద) చర్మము దళసరెక్కి గట్టి పడుట. పాదములందలి ఆనెకాయలు.

Corrosive (కరాసివ్) : శరీర ధాతువులను నాశనము చేయునట్టిది.

Corrugated [nails] (కరుగేటెడ్ నెయిల్స్) : ముడుతలు పడిన (గోళ్ళు).

Coryza (కొరిజ); Cold common (కోల్డ్ కామన్) : ముక్కు నుండి కారెడి రొంప; జలుబు.

Crab-lice (క్రాబ్-లైస్) : అంటుపేలు; జననేంద్రియ వెంట్రుకల యందుండు పేలు.

Crack (క్రాక్): శరీరమందు పగుళ్ళు; మెటికె విఱుగుట; పటపట పెద్ద శబ్దము చేయుట.

Cracking (క్రాకింగ్) : కీళ్ళయందు కలుగు శబ్దము.

Cramp (క్రాంప్) : కండరములు బాధా కరముగా, అప్రయత్నముగా దగ్గఱకు ముడుచుకు పోవుట.

Crawling (క్రాలింగ్); Creeping (క్రీపింగ్) : చంటిపిల్లవానివలె ప్రాకుచుండుట.

Crepitus (క్రేపిటస్) : చిటపట చప్పుడు; Crepitation (క్రెపిటేషన్).

Crippled (క్రిపిల్డ్) : కుంటి, అవిటి; చేతగాని.

Crippled nails (క్రిపిల్డ్ నేల్స్) : విఱిగిన గోళ్ళు.

Critical (క్రిటికల్) : అపాయకర స్థితి.

Croaking (క్రోకింగ్) : Respiration (రెస్పిరేషన్) : కప్ప (కాకి) అఱచునట్లు బొంగురుగ, లోతుగ, కటువుగ మాట్లాడుట. శబ్దము చేయుట.

Croup (క్రూప్) : కింక వాయువు, శ్వాసనాళము, స్వరపేటికల వాపు; దగ్గుతో ఊపిరి పీల్చుకొనుట కష్టముగనుండుట.

Crowing cough (క్రోయింగ్ కాఫ్) : మధ్య వయస్కులకు దగ్గుతో (శ్వాసించునపుడు) ఊపిరాడక... కాకి అఱచుచున్నట్లుండుట.

Crust (క్రస్ట్) : శరీరముపై ఎండిన పక్కు.

Crusty eruptions (క్రస్టీ ఎరప్షన్స్) : పక్కు కట్టిన చర్మవ్యాధులు.

Crupped teeth (కప్డ్ టీత్) : పంటి చివరలు లోపలికి అఱిగి 'కప్' ఆకృతిగ ఉండుట.

Curdled stool (కర్డిల్డ్ స్టూల్) : పెరుగువలె కుదపలు కుదపలుగా నుండు విరేచనము.

Curvature of spine (కర్వేచర్ అవ్ స్పైన్) : గూని; వెన్నుపాము ముందుకు (Lordosis = లార్డోసిస్) గాని, వెనుకకు (Kyphosis = కెఫోసిస్) గాని, ప్రక్కలకు (Scoliosis = స్కోలియోసిస్) గాని వంగుట.

Cyst (సిస్ట్) : మూత్రకోశము యొక్క అమత్వక్కు సంబంధమగు తిత్తియందు ద్రవము కూడునట్టి కంతి.



Dandruff (డాన్‌డ్రఫ్): తలపైన కేశము లున్న భాగమందు-పొరలు పొరలుగా నేర్పడు చుండు.

Deadness (డెడ్‌నెస్); Numbness (నంబ్‌నెస్) : మృతినొందినట్లుండుట; తిమ్మిరెక్కుట.

Debauch (డిబాచ్) : తిండి, త్రాగుడు, వ్యభిచారములలో మితములేకుండుట.

Decayed teeth (డెకేడ్ టీత్) : పుప్పి పల్లు.

Deep respiration (డీప్ రెస్పిరేషన్) : శ్వాసను లోతుగ పీల్చుట.

Deformed (డిఫార్మ్డ్); Deformity (డిఫార్మిటి) : అంగవికృతి; అంగవికారము.

Degeneration (డీజనరేషన్) : టిష్యూలు లేక ఏదేని అవయవము జబ్బు స్థితి నొందుట.

Delirium (డిలిరియమ్) : సంధి; జ్వరము లచే గాని, నాడీమండల అదురుపాటుచే గాని కలిగే మానసిక వ్యాధి.

Delusion (డిల్యూషన్) : రోగికి వ్యాధి తీవ్రతలో నేర్పడు భ్రమ; భ్రాంతి; Hallucination (హల్యూసినేషన్); Illusion (ఇల్యూషన్).

Dentition (డెంటిషన్) : దంతములు మొలచుట.

Despair (డిస్పైర్) : నిరాశ, నిస్పృహ.

Despondency (డిస్పాండెన్సీ) : నిరాశగ నుండుట; మానసికముగ క్రుంగుట.

Desquamation (డిస్క్వమేషన్); Furfuraceous (ఫర్ఫురేసియస్); Scaly (స్కేలీ) : చర్మపు పొర- పొలుసులుగా, పక్కులుగా ఊడుట.

Diaphragm (డయాఫ్రమ్) : విభాజకము; ఉదర వితానము; ఛాతీకి ఉదర కుహరము నకు మధ్యనుండు కండరపు పొర.

Dilatation of heart (డైలటేషన్ ఆఫ్ హార్ట్) : గుండెలోని ఒక అరగాని, కొన్ని అరలుగాని పెద్దవగుట.

Dim (డిమ్) : మసకగ; అస్పష్టముగ.

Diphtheria (డిఫ్తీరియా) : అపాయకరమగు అంటు వ్యాధి. దీని వలన ఒక్కోసారి గొంతుక, మెడ వాచిపోవును. ముక్కు రంధ్రములలో పొరవంటిది ఏర్పడి, ఊపిరి ఆడక పోవచ్చును. దీనినే కొందరు "కంఠ సర్పి" అందురు.

Diplopia (డిప్లోపియా) : ఒకటి-రెండుగా కనబడుట.

Dipsomania (డిప్సోమానియా) : రేయిం బవళ్లు "సురాపానము చేయవలెన"న్న ప్రగాఢ వాంఛ.

Discharges (డిశ్చార్జెస్) : విసర్జితములు అనగా... శరీరముచే విసర్జింపబడు- వాంతులు, విరేచనములు, మూత్రము, కుసుమ, చీము మొ॥నవి.

Dislocation (డిస్లొకేషన్) : అవయవము గాని, ఎముకగాని, కీలుగాని స్థానము తప్పుట.

Distention (డిస్టెన్షన్) : ఉబ్బుట, వాచుట.

Distortion (డిస్టార్షన్) : విరూపము, అంగ వైకల్యము.

Distressing (డిస్ట్రెసింగ్) : దుఃఖకరమగు; వ్యాకుల కరమగు.

Diversion (డైవర్షన్) : అన్యవిషయముల వైపు మనసు మరలుట.

Dogmatic (డాగ్మేటిక్); Dictatoria (డిక్టాటోరియా); Domineering (డామినీరింగ్); పెడవాదము; ఒక నమ్మి కకు మొండిగ కట్టుబడియుండుట.

Dorsal (డోర్సల్) : వీపుకు సంబంధించిన.

Dropping (డ్రాపింగ్) : క్రిందకు జాఱెడి.

Dwarfishness (డ్వార్ఫిష్నెస్) : మఱుగుజ్జు తనము; Cretinism (క్రెటినిజ్మ్).

Dyspnoea (డిస్ప్నోయియ); Difficult breathing (డిఫికల్ట్ బ్రీతింగ్); Breathlessness (బ్రీత్లెస్నెస్) : ఆయాస ముతో శ్వాస కష్టముగా ఉండుట.

## E

Ebullition of blood (ఎబ్యులిషన్ ఆఫ్ బ్లడ్) : రక్తము ఉబుకుట లేక పొంగుట; Orgasm (ఆర్గాజ్మ్); Arterial excitement (ఆర్టిరియల్ ఎక్సైట్మెంట్).

Eccentricity (ఎసెంట్రిసిటి) : అసహజమగు వింత స్వభావము; వెఱ్ఱి పనులు చేయుట.

Ecchymosis (ఎఖిమోసిస్); Suggilation (సజిలేషన్); Bruise (బ్రూయిస్) : కముకు (నల్లని-నీలి) మచ్చలేర్పడుట.

Ecstasy (ఎక్స్టసీ); Exhilration (ఎగ్జిల రేషన్): మైమఱచుట; అమితానంద స్థితి.

Egotism (ఎగొటిజ్మ్); Selfishness (సెల్ఫిష్‌నెస్); Selfesteem, Self-satisfaction (సెల్ఫ్‌సేటిస్‌ఫేక్షన్) : తన గుఱించి తాను ఎడతెగకుండ చెప్పు కొనుట; అహంభావము.

Elephantiasis (ఎలిఫెంటియాసిస్); Barbadoes leg (బార్బడోస్ లెగ్); Filariasis (ఫైలేరియాసిస్): బోదకాలు.

Emaciation (ఎమేసియేషన్) : సన్న బడుట; చిక్కిపోవుట.

Emission seminal (ఎమిషన్ సెమినల్): శుక్రము అప్రయత్నముగ స్ఖలనమగుట.

Emphysema (ఎంఫిసెమ) : వాయువు (గాలి)తోగాని, గాస్‌తోగాని ధాతువులు ఉబ్బుట; ఊపిరితిత్తుల యందలి వాయు గోళములు అత్యధికముగ ఉబ్బిన పరిస్థితి.

Emprosthotonos (ఎంప్రాస్తొటోనస్) : శరీరము ముందుకు వంగునట్టి ఈడ్పులు.

Enamel of teeth (ఎనామెల్ ఆఫ్ టీత్): దంతముల ఉపరిభాగమునందలి పింగాణీ వంటి గట్టిపొర.

Epileptic (ఎపిలెప్‌టిక్) : మూర్ఛకు సంబంధించిన.

Epistaxis (ఎపిస్‌టాక్సిస్); Nose-bleed (నోస్-బ్లీడ్) : ముక్కునుండి రక్తము కాఱుట.

Epithelium (ఎపిథెలియమ్) : చర్మము యొక్క అమత్వక్కుల యొక్క ఉపరి భాగమును కప్పియుండు పొర.

Epulis (ఎపులిస్) : పంటి చిగుళ్ళపై ఏర్పడు వ్రణము లేక కంతి.

Erection (ఎరక్షన్) : పురుషులలో శిశ్నము గానీ; స్త్రీలలో క్లిటోరిస్‌గానీ, స్తనములుగానీ నిక్కి ఉబ్బుట.

Erosion (ఇరోషన్) : పుండుపడి ఉపరి భాగపు ధాతువు పోవుట, ఒరయుట.

Eructations (ఎరుక్టేషన్స్); Belching (బెల్చింగ్) : త్రేన్పులు.

Eruptions (ఎరుప్షన్స్) : దద్దుర్లు, బొబ్బలు.

Erysipelas (ఎరిసిపెలాస్) : విసర్పి; అక్కి; ఒక రకపు అంటువ్యాధి. చర్మము వాచి, బాగా ఎఱ్ఱబడి జ్వరము మొ॥గు లక్షణము లుండుట.

Esophagus (ఎసోఫగస్) : నోటి వెనుక భాగమైన Pharyns (ఫేరిన్స్) నుండి కడుపు వఱకుగల అన్నవాహిక.

Eversion of eye lids (ఎవర్షన్ ఆఫ్ ఐ లిడ్స్) : పై కనుఱెప్ప వెలుపలికి తిరుగ బడుట.

Exanthematic fevers (ఎగ్జాంథెమేటిక్ ఫీవర్స్) : పొంగు (తట్టు)తో కూడిన జ్వరములు.

Excitement (ఎక్సైట్‌మెంట్) : మానసిక ఉద్రేకము.

Excoriated eruptions (ఎక్స్‌కోరియేటెడ్ ఎరుప్షన్స్) : పై చర్మము ఊడిపోయి, పుండిపడిన (ఒరుపుకలిగించిన) చర్మ వ్యాధులు.

Excrescene (ఎక్స్‌క్రిసెన్స్) : ధాతువులు అత్యధికముగ పెరుగుట; కణితి; బుడిపి; కాయ.

Exfoliation (ఎక్స్‌ఫొలియేషన్) : (ఎముక, గోళ్ళు, చర్మము మొ॥గువాని) మృతి నొందిన ధాతువులు పలుచని పొరలుగ ఊడిపోవుట.

Exhale (ఎగ్జేల్) : శ్వాసను బయటకు విడచుట.

Exophoria (ఎక్సోఫోరియా) : కన్ను వెలుపలి కొలికివైపుకు తిరుగునట్టి మెల్ల.

Exophthalmic (ఎక్సిఆఫ్తాల్‌మిక్) : కనుగ్రుడ్లు ముందుకు తోసుకు వచ్చుట.

Exostosis (ఎక్జోస్టోసిస్) : ఎముకగాని, ఉపాస్థిగాని అధికముగ పెరిగి కంతివలె ఏర్పడుట.

Expectoration (ఎక్స్‌పెక్టోరేషన్); Sputum (స్ప్యూటమ్): దగ్గుటవలన కళ్లె, కఫము మొ॥గు వానిని పైకి తెచ్చి ఉమ్ముట.

Expiration (ఎక్స్‌పైరేషన్) : శ్వాసను ఊపిరి తిత్తుల నుండి పైకి వదలుట; అంతము లేక మరణము.

Explosive cough (ఎక్స్‌ప్లోసివ్ కాఫ్) : మందుగుండు సామగ్రి ప్రేలుతున్నట్లుగా పెద్ద శబ్దముతోనుండు దగ్గు.

Extremities (ఎక్స్‌ట్రెమిటీస్) : కాళ్ళు, చేతులు.

Extremities lower (ఎక్స్‌ట్రెమిటీస్ లోయర్) : కాళ్ళు.

Extremities upper (ఎక్స్‌ట్రెమిటీస్ అప్పర్) : చేతులు..

Exudation (ఎక్సుడేషన్); Oozing (ఊజింగ్) : చెమర్చుట, ఊరుట, ఒక పొరగుండా ద్రవము వెడలుట.



Faeces (ఫేసెజ్); Faces (ఫేసెస్) : మలమురి; ప్రేగుల నుండి కలుగు స్రావము.

Faintswoon (ఫెయింట్‌స్వూన్); Syncope (సిన్‌కోప్): మూర్ఛ; మెదడుకు రక్తసరఫరా తగ్గుటచే స్వల్పకాలము స్పృహ తప్పుట.

Faintness (ఫెయింట్‌నెస్); Emptiness (ఎంప్టినెస్); Sinking (సింకింగ్) : మూర్ఛ; నిస్త్రాణ; నిస్సత్తువ.

Fan-like motion (ఫాన్-లైక్ మోషన్) : విసనకఱ్ఱ వంటి కదలిక.

Far-sighted (ఫార్-సైటెడ్) : దగ్గఱగ వున్నవి కనబడక పోవుట.

Fasting (ఫాస్టింగ్) : ఉపవాసము; లంఘనము (లంకణము).

Fatigueing (ఫాటిగ్యూయింగ్); Exhausting (ఎగ్జాస్టింగ్) : అలసటను కలిగించు.

Fatty (ఫాటీ); Greasy (గ్రీజీ) : జిడ్డుగ, క్రొవ్వుగనుండే.

Fauces (ఫాసెజ్); Throat (త్రోట్) : నోటి వెనుక భాగము. నోటి నుండి ఫేరింక్స్ (Pharynx) వఱకుగల గొంతుక.

Felon (ఫెలాన్); Whitlow (విట్‌లో); Onychia (ఒనీఖియా); Paronchia (పరోంఖియా); Panaritium (పానారిష్యమ్) : గోరుచుట్టు.

Fermentation (ఫెర్‌మెన్‌టేషన్) : నిలువ యుండుటచే పులిసి పొంగుట.

Festering pain (ఫెస్టెరింగ్ పేన్) : చీము పట్టుటచే కలుగు నొప్పి.

Fickle (ఫికిల్); Inconstant (ఇన్‌కాన్‌స్టెంట్); Capriciousness (కేప్రిషస్‌నెస్); Changeable (ఛేంజెబుల్) : నిలకడలేని; చంచలమైన.

Fidgety (ఫిడ్‌జిటి); Restlessness (రెస్ట్‌లెస్‌నెస్): శరీరముగాని, శరీరభాగముగాని అస్థిమితముగా కదలుచుండుట.

First aid (ఫస్ట్ ఎయిడ్) : ప్రథమచికిత్స.

Fish-bone (ఫిష్-బోన్) : చేపముల్లు; చేప ఎముక.

Fissure (ఫిషర్) : పగులు; బీట; చీలిక; చిన్న సన్నని పుండ్లు; Crack (క్రాక్); Chap (చాప్); A split (ఎ స్ప్లిట్).

Fistula (ఫిస్టులా) : రెండు ఉపరి భాగముల మధ్య ఏర్పడు అస్వభావికమగు రంధ్రము. సాధారణముగ గుదము వద్ద ఇట్లు ఏర్పడును.

Flapping (ఫ్లేపింగ్) : పక్షి తెక్కలవలె కొట్టుకొనుట.

Flatulence (ఫ్లాట్యులెన్స్) : జీర్ణకోశము,

ప్రేగులు గాలితో ఉబ్బరించుట. ఇందు వలన... ప్రేగులలో గుడగుడ శబ్దము కలుగును.

Flatus (ఫ్లాటుస్) : జీర్ణకోశమందుగాని, ప్రేగులందుగాని యుండు గాలి. ఇది త్రేపులుగా, అపానవాయువుగ వెడలును.

Flexor *or* Flexure muscle (ఫ్లెక్సార్ ఆర్ ఫ్లెక్సుర్ మజిల్) : ఒక భాగమును వంచుటకు ఉపయోగపడెడి. కండరము లేక స్నాయువు.

Fluctuation (ఫ్లక్చ్యుయేషన్) : ద్రవము గల కంతిని గాని, చీముగల వ్రణమును గాని వ్రేలితో పరీక్షించునపుడు కలుగు కెరటము వంటి కదలిక.

Fluids (ఫ్లూయిడ్స్); Liquids (లిక్విడ్స్) : ద్రవములు.

Fontanelle (ఫాంటనెల్లి) : బ్రహ్మరంధ్రము.

Forebodings (ఫోర్‌బోడింగ్స్) : ముందు కలుగబోవు వాటిని గూర్చి ముఖ్యముగ చేడును గూర్చి, అపాయమును గూర్చి మనసుకు తట్టుచుండుట. ఆపద కలుగు చున్నదను భావన.

Foreign body (ఫారిన్ బాడీ) : అన్య పదార్థము.

Formication (ఫార్మికేషన్); Crawling (క్రాలింగ్) : శరీరముపై చీమలు ప్రాకు తున్నట్లు ఉండుట.

Frail (ఫ్రేల్) : పెళు సైన; సున్నిత మైన; చంచలమైన.

Frantic (ఫ్రాంటిక్); Rage (రేజ్) : ఒళ్ళు తెలియని కోపముచే... అమితోద్రేకము నొందుట.

Fretting (ఫ్రెట్టింగ్) : కోపముతో చిరు బురులాడు.

Frightful (ఫ్రైట్‌ఫుల్) : అతి శీతలముచే దేహము ఎఱ్ఱబాఱి వాచి పోవుట.

Frothy (ఫ్రాథీ) : మరుగుతో కూడిన.

Fulminate (ఫల్మినేట్) : త్వరితముగ వృద్ధి చెంది, అంతే త్వరితముగ అంతమగుట.

Fungoid growth (ఫంగోయిడ్ గ్రోత్) : కుక్కగొడుగువలె... ఉబ్బెత్తుగ పెరుగు ఎదుగుదల.

Fungus (ఫంగస్); Proud flesh (ప్రౌడ్ ఫ్లెష్) : సూక్ష్మమగు ఫంగస్ వలన నోటి లోనూ, యోని లోనూ పుండ్లు (పూత) ఏర్పడుట; కొన్నిరకముల ఊపిరితిత్తుల వ్యాధులు; పాదముల వ్రేళ్ళమధ్య పుండ్లు మొ॥వి ఏర్పడుట.



Gagging (గాగింగ్) : నోరు తెఱచికొని యుండునట్లుచేయు.

Galactorrhoea (గాలక్టోరియా) : పాలు అత్యధికముగా స్రవించుట.

Gall (గాల్); Bile (బైల్) : పైత్యరసము.

Ganglion (గాంగ్లియన్) : నాడీ మండలములో కొన్ని ప్రదేశములందు నాడీకణములు సమూహముగ కూడును. వీటిని "Nuclei (నుక్లీ)" అందురు. నాడీకణముల సమూహములు మెదడుకు, వెన్నుపాముకు వెలుపల ఏర్పడినచో "ganglia (గాంగ్లియా)" అందురు.

Gangrene (గాంగ్రేన్); Mortification (మార్టిఫికేషన్) : శరీరమునందలి మెత్తని ధాతువులు మృతినొందుట.

Gargling (గార్గ్లింగ్) : పుక్కిలించుట.

Gasping (గాస్పింగ్) : ఎగశ్వాస.

Gastric (గ్యాస్ట్రిక్) : జీర్ణకోశ సంబంధమైన.

Gauze (గాజ్); Foggy (ఫాగీ) : గాయ ములకు కట్టుకట్టుటకు మరియు శస్త్ర చికిత్స సందర్భములలో ఉపయోగించు దోమతెరవంటి గుడ్డ.

Genitalia (జనిటాలియా); Organs of generation (ఆర్గాన్స్ ఆఫ్ జనరేషన్) : జననేంద్రియములు.

Gesture (గెస్చర్) : చేష్ట; అభినయము; భావమును తెలుపుటకు చేతిని, తలను, శరీరమును కదపుట.

Glairy (గ్లెరీ) : జిగురుగ; కోడిగ్రుడ్డు నందలి తెల్లని సొనవలె.

Glanders (గ్లాండర్స్) : గుఱ్ఱములకు, గాడిదలకు కలుగు అంటువ్యాధి. దీని వలన క్రింది దవుడ వాచి, ముక్కు నుండి ఆమము స్రవించును. ఇటీవల ఇది మానవులకు కూడ సోకుచున్నది.

Glaucoma (గ్లాకోమా) : అపాయకరమగు కంటి వ్యాధి. దీనివలన అంధత్వము కలుగుచున్నది. కన్ను ఎఱ్ఱగ నుండి, చూపు అలుకుకు పోవును; Tonometer (టోనోమీటర్)చే దీనిని కనిపెట్టవచ్చును.

Glutinous (గ్లూటినస్); Viscid (వైసిడ్): జిగురుగనుండు.

Gnawing pain (న్యాయింగ్ పేన్) : కొఱుకుకు తినుచున్నట్లుండు తీవ్రనొప్పి.

Goiter *or* goitre (గోయ్‌టర్); Derbyshire neck (డెర్బిషైర్ నెక్) : మెడ యందలి థైరాయిడ్ గ్రంధి పెద్దదగుట.

Gonorrhoea suppressed (గనోరియా సప్రెస్ట్) : సెగ అణగాఱుట.

Gooseflesh (గూస్‌ఫ్లెష్); Gooseskin (గూస్‌స్కిన్); Horripilation (హారిపిలేషన్) : గగుర్పాటు; రోమకూపముల వద్ద చర్మము ఉబ్బుట.

Gout (గౌట్) : దీర్ఘవ్యాధి. శరీరమందలి యూరిక్ ఏసిడ్‌ను. శరీరావయవములు బహిష్కరింపలేకపోవుటచే కలుగు వ్యాధి. దీనివలన కీళ్ళు వాచి, బాగా నొప్పిగా నుండును.

Griping pain (గ్రిపింగ్ పేన్); Grinding pain (గ్రైండింగ్ పేన్) : శూలనొప్పి.

# H

Hemiopia (హెమియోపియా) : వస్తువులు సగము మాత్రమే అగుపడుట. Half-sight (హాఫ్‌సైట్).

Hemming (హెమింగ్) : స్పష్టముగా పైకిరాని దగ్గు. దీని విషయములో జాగ్రత్త అవసరము.

Hepatization of lungs (హెపటిజేషన్ ఆఫ్ లంగ్స్) : ధాతువులందు మార్పు కలిగి ఆ భాగము కాలేయాకృతి బొందుట.

Herpes (హెర్పెస్); Tetter (టెట్టర్) : చర్మము మీద-ఆమత్వక్కుల మీద ద్రవపు పొక్కులు కలిగి, తరువాత అచట పుండు పడును.

Hide-bound (హైడ్-బౌండ్) : పోషణ సరిగా లేకపోవుట వలన వీపుకు, ప్రక్క టెముకలకు చర్మము అంటుకుపోవుట.

Hip (హిప్) : తుంటి; తొడయొక్క ఊర్ధ్వ భాగము.

Hip joint (హిప్ జాయింట్) : తుంటి కీలు.

Hordeolum stye (హోర్డియోలమ్ స్టై) : కనుతెప్పమీద లేచు కుఱుపులు.

Horny (హార్ని) : కొమ్మువంటి; గట్టిపడిన.

Horrible (హారిబుల్) : అమిత భయోత్పాతమైన, ఘోరమైన.

Howling (హౌలింగ్) : "కుయ్యో! మొర్ర్రో!" యని ఏడ్చుట.

Hydrocephalus (హైడ్రోసెఫలస్); Hydrocephaly (హైడ్రోసెఫలీ); Braindropsy (బ్రైన్ డ్రాప్సీ) : కపాలములో cerebro-spinal (సెరిబ్రో-స్పైనల్) ద్రవము హెచ్చుట.

Hydrophobia (హైడ్రోఫోబియా) : నీటిని చూచినను, నీటిశబ్దము విన్నను, నీటిని తాకినను భయము; ఇది రాబిస్ (rabies) వ్యాధికి గుర్తు.

Hydrothorax (హైడ్రోథోరాక్స్); Dropsy of the chest (డ్రాప్సీ ఆఫ్ ది చెస్ట్) : ఛాతీకి నీరు పట్టుట.

Hyperaesthesia (హైపర్‌యెస్తీషియా); Over sensitiveness (ఓవర్ సెన్సిటివ్ నెస్); Excessive sensibility (ఎక్సెసివ్ సెన్సిబిలిటి) : సహనశక్తి ఏ మాత్రము లేకపోవుట.

Hypermetropia (హైపర్ మెట్రోపియా); Far-sight (ఫార్-సైట్); Long-sightedness (లాంగ్‌సైటెడ్‌నెస్) : దూరముగానున్నవి మాత్రమే కనబడుట.

Hypertrophy (హైపర్‌ట్రోఫి) : ఏదేని ఒక అవయవము అసాధారణముగా పెద్దది యగుట.

Hypochondria (హైపోకాండ్రియా) : ఉదర కుహర ఊర్ధ్వ భాగమందలి ఇరు పార్శ్వ ములు వ్యాధిగ్రస్తమగుటచే తీవ్ర బాధ నొందుట.

Hypogastrium (హైపోగాస్ట్రియమ్) : పొత్తికడుపు; ఉదరకుహరములో నాభి క్రింది మధ్యభాగము.



Ichthyosis (ఇచ్‌థోయిసిస్); Fish-skin (ఫిష్-స్కిన్) : పుట్టుకతో వచ్చిన పొలుసు లూడుచుండెడు చర్మవ్యాధి.

Idiocy (ఇడియొసి) : పుట్టుక నుండి మానసిక శక్తులు తక్కువగా నుండువాడు.

Ilium (ఇలియమ్); The flank (ద ఫ్లాంక్) : Innominate bone (ఇన్నామి నేట్‌బోన్) యొక్క ఊర్ధ్వభాగము. Hunch-bone (హంచ్-బోన్); శ్రోణ్యస్థి; తుంటిఎముక యొక్క ఊర్ధ్వ భాగము; ప్రక్కటెముకలకు, తుంటికి మధ్యనగల భాగము.

Imbecility (ఇంబెసిలిటి) : అల్పమానసిక శక్తి.

Inco-ordination (ఇన్‌కో-ఆర్డినేషన్) : కండరముల కదలికలు సమన్వయముగ నుండకపోవుట.

Incrustation (ఇన్‌క్రస్టేషన్) : పెచ్చు కట్టుట.

Indented (ఇండెంటెడ్) : నొక్కులు పడిన; సొట్టలు పడిన.

Indolence (ఇండొలెన్స్) : సోమరితనము.

Induration (ఇన్‌డ్యురేషన్) : గట్టిపడుట; ధాతువు గట్టిపడుట.

Inelasticity (ఇన్‌యెలాస్టిసిటి) : బిఱ్ఱబిగి యుట; లొంగని.

Infant (ఇన్‌ఫాంట్) : శిశువు, ఒక సంవత్స రము లోపు వయస్సుగల శిశువు.

Infiltration (ఇన్‌ఫిల్‌ట్రేషన్) : ధాతు మధ్యస్థ ప్రదేశములందుగాని, శరీరములో గుల్లగయుండు ప్రదేశములందుగాని ద్రవము కూడుట.

Inflammatory fever (ఇన్‌ఫ్లమేటరీ ఫీవర్) : అవయవముల వాపుతో కూడిన జ్వరము.

Ingrowing-nails (ఇన్‌గ్రోయింగ్-నేల్స్) : గోరు- ప్రక్కధాతువులోనికి వ్యాపించి, వాపును కలిగించుట.

Injury (ఇంజ్యూరీ) : గాయము, హాని.

Inoculation (ఇనాక్యులేషన్); Injection (ఇంజెక్షన్); Shot (షాట్) : టీకాలు వేయుట.

Insensibility (ఇన్‌సెన్సిబిలిటి) : ఇంద్రియ ములు పనిచేయని స్థితి; స్పృహ లేక పోవుట; బాధ మొ॥నవి తెలియని స్థితి; నిర్దయ.

Insidious (ఇన్‌సిడియస్) : వ్యాధి లక్షణ ములు స్పష్టముగా కనిపించుట.

Inspiration (ఇన్‌స్పిరేషన్) : ఉచ్ఛ్వాసము; ఊపిరిలోనికి పీల్చుకొనుట.
Instability (ఇన్‌స్టెబిలిటి) : అస్థిరత; చాంచల్యము.
Intense (ఇంటెన్స్) : తీవ్రమైన.
Intermittent fever (ఇంటర్‌మిటెంట్ ఫీవర్) : చలిజ్వరము; విడిచివిడిచి వచ్చే జ్వరము.
Internal (ఇంటర్నల్) : లోని; అంతర్గత.
Intertrigo (ఇంటర్‌ట్రిగో); Excoriation (ఎక్స్‌కొరియేషన్); Chafing (ఛాఫింగ్) : ఒరయుట; తేమగ యుండు చర్మపు ముడతలందు పైపైననే కలుగు వాపు. చంటిపిల్లలందు, గజ్జలందు, పిఱుదుల మధ్య, జననేంద్రియమందు, చెవుల వెనుక, చంకలందు, మెడముడుతలందు ఇట్లు కలుగవచ్చును.
Intoxication (ఇంటాక్సికేషన్) : త్రాగుడు వలన కలిగిన మైకము; మత్తు.
Intussusception (ఇంటస్‌ససెప్షన్) : ప్రేగు యొక్క ఒక భాగము- దాని ప్రక్కనే గల మరియొక భాగము లోనికి చొచ్చుకు పోవుట. దీని వలన తఱచుగా తీవ్రమగు నొప్పి, వాంతులు కలుగును. దీనికి వెంటనే శస్త్రచికిత్సను చేయించవలయును.
Inversion (ఇన్‌వెర్షన్) : లోపలి భాగము పైకి తిరగబడుట (గర్భకోశము మొ॥వి).
Involuntary muscles (ఇన్‌వాలంటరీ మజిల్స్) : అనియంత్రిత కండరములు; స్వతంత్ర కండరములు.
Iron (ఐయొర్న్); Ferrum (ఫెర్రమ్) : శరీర మందలి ధాతువులకు-ప్రాణవాయువును సరఫరా చేసెడి రక్తమందలి హెమోగ్లోబిన్‌లో గల ఇనుము.
Irregular (ఇర్రెగ్యులర్) : కాలనియమము లేని; అక్రమమైన.
Irrepressible (ఇర్రెప్రెసిబుల్) : అణచుటకు వీలులేని.
Irresistible (ఇర్రెసిస్టిబుల్) : ఆపుకొనుటకు వీలులేని.
Irritation (ఇరిటేషన్) : క్షోభము.
Isolation (ఐసోలేషన్) : తీవ్ర అంటువ్యాధి గల రోగిని-ఇతరుల నుండి దూరముగా నుంచుట.
Itching (ఇచ్చింగ్) : దురద; దురదగా నుండు.

## J

Jerking pain (జెర్కింగ్ పేన్) : చివుక్కున లాగుకొనునట్లు చేయు నొప్పి.
Joint (జాయింట్) : కీలు; శరీరమందలి ఎముకలు ఒక దానితో మరి యొకటి కలియు ప్రదేశము.

## K

Kleptomania (క్లెప్టోమేనియా) : తన మనసునకిష్టము లేకపోయినను "దొంగ తనము చేయవలెన"నెడి పట్టశక్యముగాని కోరిక.
Kneel (నీల్) : మోకాళ్ళమీద నిలబడుట; మోకరించు.
Knotty (నాటీ) : ముడులుగల; బుడిపెగల.

## L

Laceration (లెసెరేషన్) : అంచులు క్రమముగా లేని చీల్చబడిన గాయము.
Lachrimation *or* Lachrymation *or* Lacrimation (లేక్రిమేషన్) : కన్నీరు కార్చుట.
Lactation (లాక్టేషన్) : తల్లి బిడ్డకు పాలిచ్చే కాలము.
Lameness (లేమ్‌నెస్) : కుంటితనము.
Languor (లాంగెర్) : నిస్త్రాణ; బడలిక; ఆయాసము.
Laryngismus stridulus (లారింజిజ్‌మస్ స్ట్రిడ్యులస్): లారింగ్స్‌కు ఈడ్పు కలుగు

Sphenoid bone (స్ఫినాయిడ్ బోన్) : మెదడు అడుగున ముందుభాగమునందు గల 'సీతాకోక చిలుక' ఆకృతిగ నుండు ఎముక.

Spinal cord (స్పైనల్ కోర్డ్) : వెన్నుపాము.

Spleen (స్ప్లీన్) : ప్లీహము.

Sternum (స్టెర్నమ్) : ఱొమ్ము టెముక.

Stomach (స్టమక్) : జీర్ణాశయము, జీర్ణ కోశము, కడుపు.

Styloid process (స్టైలాయిడ్ ప్రాసెస్): కణత ఎముక యొక్క పొడుగాటి భాగము.

Sub-lingual gland (సబ్-లింగ్యుయల్ గ్లాండ్) : నాలుక క్రిందగల లాలాజల గ్రంథి.

Sub-maxillary gland (సబ్-మాక్సిలరీ గ్లాండ్) : దవుడ క్రిందగల లాలాజల గ్రంథి.

Superior maxilla (సుపీరియర్ మాక్సిలా) : పై దవుడ.

Sutures (సుటూరెస్) : కపాలపు ఎముకల సంధులు.

Symphysis pubis (సింఫైసిస్ ప్యూబిస్): కూపకము; కటి ముందు భాగపు ఎముకల కలయిక.

Tarsal bones (టార్సల్ బోన్స్) : చీల మండ ఎముకలు.

Temporal bone (టెంపోరల్ బోన్) : కణత ఎముక.

Temporal lobe (టెంపోరల్ లోబ్) : మెదడునందలి కణత భాగము.

Testicles (టెస్టికల్స్) : వృషణములు.

Thigh (థై) : తొడ.

Thoracic vertebrae (థొరాసిక్ వెర్టిబ్రే): ఛాతీ వెనుక భాగమందలి వెన్ను పూసలు.

Throat (థ్రోట్) : గొంతుక.

Thumb (తంబ్) : బొటనవ్రేలు.

Thymus gland (థైమస్ గ్లాండ్) : ఱొమ్మెముక వెనుక నుండి థైరాయిడ్ గ్రంథి వఱకు వ్యాపించి యుండు గ్రంథి.

Tibia (టిబియా); Shin-bone (షిన్‌బోన్): మోకాలి ఎముక.

Toe (టో) : కాలివ్రేలు.

Tongue (టంగ్) : నాలుక.

Tonsils (టాన్సిల్స్) : గవుదబిళ్ళలు.

Trachea (ట్రాకియా) : ముఖ్య శ్వాస నాళము.

Transverse colon (ట్రాన్స్‌వెర్స్ కాలన్): పెద్ద ప్రేగు మధ్య భాగము.

Tricuspid valve (ట్రైకస్పిడ్ వాల్వ్) : త్రిపత్ర కవాటము.

Tympanic membrane (టింపానిక్ మెంబ్రేన్) : కర్ణభేరి.

Ulna (ఉల్నా) : ముంజేతిలోని చిటికెన వ్రేలి వైపుగల ఎముక.

Umbilical cord (అంబిలికల్ కోర్డ్) : నాభిత్రాడు.

Upper extremities (అప్పర్ ఎక్స్‌ట్రెమిటీస్) : చేతులు.

Upper eye lid (అప్పర్ ఐ లిడ్) : పై కనుతెప్ప.

Upper jaw (అప్పర్ జా) : పై దవుడ.

Ureters (యురెటెర్స్) : మూత్ర వాహక నాళములు.

Urethra (యురెత్రా) : మూత్రవిసర్జన నాళము.

Uterus (యుటెరస్) : గర్భకోశము.

Uvula (యువులా) : కొండ నాలుక.

Vas deferens (వేస్ డిఫెరెన్స్) : వృషణముల నుండి శుక్రమును తెచ్చు నాళములు.

Vagina (వెజినా) : యోని.

Vaginal orifice (వెజినల్ ఆరిఫైస్) : స్త్రీ జననేంద్రియ (యోని) ద్వారము.

Vertebral column (వెర్టిబ్రల్ కాలమ్): వెన్నుపాము.

Vertex (వెర్టెక్స్) : నడినెత్తి నుండిగల కపాలపు వెనుక భాగము.

Vestibule (వెస్టిబ్యూల్) : స్త్రీ జననేంద్రియ లోపలి చెవి మధ్య భాగము.

White corpuscles (వైట్ కార్పస్కిల్స్) : తెల్ల కణములు.

Wind pipe (విండ్ పైప్) : శ్వాసనాళము.

Womb (ఉంబ్) : గర్భకోశము.

Wrist (రిస్ట్) : మణికట్టు.

Zygomatic process (జైగోమేటిక్ ప్రాసెస్) : కణత ఎముకతో దవడ ఎముక కలియుచోటు.



# ANNEXURE-5



## LAB. INSTRUMENTS

## పరిశోధన శాలా పరికరములు

Caf belt (క్యాఫ్ బెల్ట్)

Centrifuge (సెంట్రిఫ్యూగ్)

Colorimeter (కలోరిమీటర్)

E.S.R. stand (ఇ.ఎస్.ఆర్. స్టాండ్)

Handle (హ్యాండిల్)

H.B. pipette (హెచ్.బి. పిపెట్)

H.B. tube (హెచ్.బి. ట్యూబ్)

Hemometer (హెమొమీటర్)

Lancet (ల్యాన్సెట్)

Microscope (మైక్రోస్కోప్)

Neubauer chamber (న్యూబెయెర్ చాంబర్)

Pipette (పిపెట్)

R.B.C. pipette (ఆర్.బి.సి. పిపెట్)

Serange needles (సిరెంజ్ నీడిల్స్)

Slides and cover shilps (స్లైడ్స్ అండ్ కవర్ షిల్ప్స్)

Spirit lamp (స్పిరిట్ లాంప్)

Stand (స్టాండ్)

Test tube (టెస్ట్ ట్యూబ్)

Urinometer (యూరినోమీటర్)

Vorl slide (ఒర్ల్ స్లైడ్)

Wash basin (వాష్ బేసిన్)

Water bath (వాటర్ బాత్)

W.B.C. pipette (డబ్ల్యు.బి.సి. పిపెట్)



# ANNEXURE-6



## CHEMICALS USED IN THE LAB.

## పరిశోధనశాలలో ఉపయోగించు రసాయన పదార్థములు

Acetone (అసెటోన్)

Acetic acid (అసెటిక్ ఆసిడ్)

Acid etharal (ఆసిడ్ ఈథరాల్)

Ammonia liquid (అమ్మోనియా లిక్విడ్)

Barium chloride ( బేరియమ్ క్లోరైడ్)

Benedicts reagent (బెనెడిక్ట్స్ రీజెంట్)

Carbal fuchsion stain (కార్బల్ ఫక్షన్ స్టేన్)

E.D.T.A. (ఇ.డి.టి.ఎ.)

Ether (ఈథర్)

Etherlich reagent (ఈథర్లిక్ రిజెంట్)

Fuchest reagent (ఫ్యూచెస్ట్ రిజెంట్)

Hyd rochloric acid (హైడ్రోక్లోరిక్ ఆసిడ్)

Hydrogen peroxide (హైడ్రోజెన్ పెరాక్సైడ్)

Immersion oil (ఇమ్మెర్షన్ ఆయిల్)

Liesh man's stain (లీష్ మన్స్ స్టేన్)

Litmus filter ph papers (లిట్మస్ ఫిల్టర్ పిహెచ్ పేపర్స్)

Lugols iodine (ల్యుగోల్స్ అయొడిన్)

Methylene blue (మెథిలిన్ బ్లూ)

Normal salin (నార్మల్ శాలిన్)

Semen diluting fluid (సెమెన్ డైల్యూటింగ్ ఫ్లూయిడ్)

Sodium citrate (సోడియమ్ సిట్రేట్)

Sodium nitro prusside crystals (సోడియమ్ నైట్రో ప్రూసైడ్ క్రిస్టల్స్)

Sulphur powder (సల్ఫర్ పౌడర్)

W.B.C. diluting fluid (డబ్ల్యు.బి.సి. డైల్యూటింగ్ ఫ్లూయిడ్)

#  ANNEXURE-7 

## ABBREVIATIONS USED IN THE LAB.

## పరిశోధనశాలలో ఉపయోగించు సంకేతాక్షరములు

A.F.B. : Acid Fast Bacilli (ఆసిడ్ ఫాస్ట్ బాసిల్లి)

B.G. : Blood grouping (బ్లడ్ గ్రూపింగ్)

B.P. : Bile pigments (బైల్ పిగ్మెంట్స్)

B.P. : Blood picture *or* film (బ్లడ్ పిక్చర్ ఆర్ ఫిల్మ్)

.S. : Bile salt (బైల్ సాల్ట్)

.S. : Blood sugar (బ్లడ్ సుగర్)

.T. : Bleeding time (బ్లీడింగ్ టైమ్)

C.B.P. : Complete blood picture (కంప్లీట్ బ్లడ్ పిక్చర్)

C.S.F. : Cerebro spinal fluids (సెరెబ్రో స్పైనల్ ఫ్లూయిడ్స్)

C.T. : Clotting time (క్లాటింగ్ టైమ్)

D.C. : Differential count (డిఫరెన్షియల్ కౌంట్)

D.W. : Distil water (డిస్టిల్ వాటర్)

E.D.T.A. : Ethylene diamine tetra acetic acid (ఎథిలైన్ డైయామైన్ టెట్రా ఎసిటిక్ ఆసిడ్)

E.S.R. : Erythrocyte sedementation rate (ఎరిథ్రోసైట్ సెడిమెంటేషన్ రేట్)

F.B.S. : Fasting blood sugar (ఫాస్టింగ్ బ్లడ్ సుగర్)

G.T.T. : Glucose tolerance test (గ్లూకోజ్ టాలెరెన్స్ టెస్ట్)

H.B. : Hemo globin (హెమోగ్లోబిన్)

M.C.V. : Mean corpuscular volume (మీన్ కార్పస్క్యులర్ వాల్యూమ్)

M.F. : Microfilaria (మైక్రోఫైలేరియా)

M.P. : Malaria parasites (మలేరియా పారసైట్స్)

N.R. : Non-reactive (నాన్-రియాక్టివ్)

P.C. : Platelet count (ప్లేట్‌లెట్ కౌంట్)

P.L.B.S. : Post lunch blood sugar (పోస్ట్ లంచ్ బ్లడ్ సుగర్)

R.B.C. : Red blood cells (రెడ్ బ్లడ్ సెల్స్)

Rh. : Rheseaus (రసీయస్)

Sp. Gr. : Specific gravity (స్పెసిఫిక్ గ్రేవిటి)

T.C. : Total count (టోటల్ కౌంట్)

V.D.R.L. : Venereal Disease Research Laboratory (వెనీరియల్ డిసీజ్ రీసెర్చ్ లేబొరేటొరీ)

+Ve : Positive (ప్లస్ పాజిటివ్)

–Ve : Negative (మైనస్ నెగటివ్)

W.B.C. : White blood cells (వైట్ బ్లడ్ సెల్స్)

W.R. : Weakly reaction (వీక్లీ రియాక్షన్)

 ANNEXURE-8 

## COMMON AND SCIENTIFIC NAMES OF WORMS

## క్రిముల సామాన్య మరియు శాస్త్రీయ నామములు

| Common Name : | Scientific Name : |
|---|---|
| 1] Dwarf tape worm (డ్వార్ఫ్ టేప్ వర్మ్) | 1] Homeno lepis nana (హోమెనో లెపిస్ నానా) |
| 2] Fish tape worm (ఫిష్ టేప్ వర్మ్) | 2] Diphyllobo thrium latum (డిఫిల్లోబో థ్రియమ్ లేటమ్) |
| 3] Hook worm (హుక్ వర్మ్) | 3] Nacator americanus (నకేటర్ అమెరికానస్) |
| 4] Hook worm old world (హుక్ వర్మ్ ఓల్డ్ వరల్డ్) | 4] Anoylo stoma duodenale (అన్కోయ్‌లో స్టోమా డ్యుయోడెనాల్) |
| 5] Inter spinal schistosoma (ఇంటర్ స్పైనల్ స్కిస్టోసోమా) | 5] Schistosoma monsoni (స్కిస్టోసోమా మాన్సోని) |
| 6] Pin worm (పిన్ వర్మ్) | 6] Enterobius vermicularis (ఎంటెరోబియస్ వెర్మిక్యులారిస్) |
| 7] Round worm (రౌండ్ వర్మ్) | 7] Scaris lumbricoidies (స్కారిస్ లుంబ్రికాయిడిస్) |
| 8] Thread worm (థ్రెడ్ వర్మ్) | 8] Strogy loides streconalis (స్ట్రాంగిలాయిడిస్ స్టెర్కోరియల్స్) |
| 9] Vesical schistosoma (వెసికల్ స్కిస్టోసోమా) | 9] Schistosoma haematobium (స్కిస్టోసోమా హెమటోబియమ్) |
| 10] Whip worm (విప్ వర్మ్) | 10] Trichuris trichura (ట్రిచురిస్ ట్రిచురా) |

# ANNEXURE-9
## USAGES OF LAB. EQUIPMENT
## పరిశోధనశాలా పరికరముల ప్రయోజనములు

Caf belt (క్యాఫ్ బెల్ట్) : దీనిని రోగి చేతిపై భాగము మీద బిగించి కట్టుట వలన... నరములు బాగుగా కనిపించును. దీనితో రోగి రక్తనాళముల నుండి సులువుగా రక్తమును సేకరించవచ్చును.

E.S.R. Stand (ఇ.ఎస్.ఆర్.స్టాండ్) : దీని యందు పిపెట్స్ ఉండును. వీటిపైన '0' నుండి '180' వఱకు గుర్తించి యుండును. పరీక్షచేయు రక్తమును '0' గుర్తువఱకు తీసికొని స్టాండ్‌నందు బిగించవలెను.

Hemocyto meter (హెమోసైటో మీటర్) : దీనియందు T.C. చేయుటకు అవసరమైన W.B.C./R.B.C. Pipettes మరియు Cells లెక్కించుటకు కావలసిన Counting chamber (కౌంటింగ్ ఛాంబర్) ఉండును.

Hemo meter (హెమో మీటర్) : దీని యందు హెమోగ్లోబిన్ పరీక్షచేయుటకు అవసరమైన హెమోగ్లోబిన్ పిప్పెట్ మరియు Tube (ట్యూబ్) ఉండును. హెమో మీటర్ రెండు ప్రక్కల హెమో గ్లోబిన్ గుర్తించుటకు తగినరంగు కలిగిన ట్యూబ్స్ ఉండును.

Lancet (లాన్సెట్) : దీనిని ఉపయోగించి చేతివ్రేళ్ళ నుండి రక్తమును సేకరించ వచ్చును.

Pipettes (పిపెట్స్) : పరీక్షకు అవసరమైన పరిమాణము గల ద్రావణములను సేకరించుటకు ఇది తోడ్పడును.

Test tubes (టెస్ట్ ట్యూబ్స్) : పరీక్ష చేయుటకు ఉపయోగించు గాజునాళికలు. వీటినే "పరీక్షనాళికలు" అంటారు.

Urino meter (యూరినో మీటర్) : దీని పైన సాధారణముగా 1000 నుండి 1060 వఱకు గుర్తించియుండును. పరీక్షచేయు మూత్రమునందు దీనిని ఉంచిన.... ఇది, కొంతభాగము వఱకు మూత్రమునందు ప్రవేశించును. అపుడు ఆ ప్రదేశమునందు గల రీడింగ్‌ను గుర్తించ వలయును.

V.D.R.L. Slide (వి.డి.ఆర్.ఎల్. స్లైడ్) : ఇది మామూలు స్లైడ్ ఆకారమునే కలిగి యుండును. దీని యందు చిన్నచిన్న గుంటలు ఉండును. V.D.R.L. పరీక్ష చేయునపుడు ఈ గుంటలయందు Serum Antigen (సీరమ్ ఏంటిజెన్) లను వేసి పరీక్ష చేయవలెను.

# ANNEXURE-10
## BIO-CHEMISTRY TERMS
## జీవ-రసాయన శాస్త్ర పద వివరణ

B : ఏదైనా పరీక్షచేయునపుడు... దానికి అవసరమైన Blank (బ్లాంక్)ను గుర్తించుటకు 'B' గుర్తును వాడుదురు.

Fasting (ఫాస్టింగ్) : ఏరకమైన ఆహార పదార్థములనూ రోగి భుజించకముందు ఉదయముపూట 'శాంపిల్స్' సేకరించి చేయు పరీక్షలను "Fasting tests" అంటారు.

Kits (కిట్స్) : బయోకెమిస్ట్రీ పరీక్షలను నిర్వహించుటకు అవసరమైన రసాయనములతో నింపిన 'కిట్స్' మార్కెట్‌లో లభించు చున్నవి. ఈ కిట్స్‌లో అనేక రసాయనములతో పాటు- వాటిని ఎలా 'డైల్యూట్' చేసి, వినియోగించ వలసి వుంటుందో వివరములు కూడా వుండగలవు.

Post lunch (పోస్ట్ లంచ్) : రోగి ఏదైనా ఆహారమును భుజించిన తరువాత 'శాంపిల్స్' సేకరించి చేయు పరీక్షలను "Post lunch tests" అంటారు.

S : ఏదైనా పరీక్ష చేయునపుడు- దానికి అవసరమైన Working standard (వర్కింగ్ స్టాండర్డ్)లో వున్న ద్రావణమును 'టెస్ట్‌ట్యూబ్ (Test tube)' లోనికి తీసికొంటారు. ఈ స్టాండర్డ్‌ను గుర్తించుటకు 'S' గుర్తును వాడుతారు.

Sample (శాంపిల్) : పరీక్ష చేయుట కొఱకు రోగి నుండి సేకరించిన- రక్తము, మలము, మూత్రము మున్నగు వానిని 'శాంపిల్' అందురు.

T : ఏదైనా పరీక్ష చేయుట కొఱకు టెస్ట్ ట్యూబ్‌లోనికి- రక్తము, సిరమ్, ప్లాస్మా మున్నగు వానిని తీసికొందురు. 'Test చేయుట కొఱకు' అన్న గుర్తుగా ఆ ట్యూబ్‌పైన 'T' గుర్తును వాడుదురు.

# ANNEXURE-II
# BLOOD-GROUPS & TESTS
# రక్తసముదాయములు & పరీక్షలు

Blood grouping (బ్లడ్ గ్రూపింగ్) : రక్తములోని గ్రూప్‌లు : అత్యవసర సమయముల యందు ఒకరి నుండి మరియొకరికి రక్తమును మార్పిడి చేయుట అవసరమగును. రక్తములో వివిధ రకముల గ్రూప్‌లు ఉండును. ఒకరి నుండి మరొకరికి రక్తము మార్చునపుడు ఆ ఇద్దరి వ్యక్తుల యొక్క రక్తము గ్రూప్‌లు తెలిసి కొనుట అత్యవసరము! లేనిచో.... రక్త గ్రహీతకు ప్రాణాపాయము సంభవించును. రక్తములో ముఖ్యముగా నాలుగు గ్రూప్‌లు గలవు : 1] A-గ్రూప్, 2] B-గ్రూప్, 3] AB-గ్రూప్, 4] O-గ్రూప్. మన రక్తము యొక్క గ్రూప్ ఎఱ్ఱ రక్తకణముల లోని Antigen పై ఆధారపడి యుండును. 'A' Antigen, 'B' Antigen అను రెండు రకముల Antigen లు రక్తకణములలో ఉండు విధానము ననుసరించి రక్తమును నాలుగు గ్రూప్‌లుగా విభజించినారు.

'A' group (ఎ గ్రూప్) : ఈ వ్యక్తుల ఎఱ్ఱ రక్తములో 'A' Antigen ఉండును. వీరి ప్లాస్మాయందు Anti 'B' (యాంటి 'బి') Antibody (యాంటిబాడీ) ఉండును. 'A' Antigen రక్తములో... రెండు రకములుగా ఉండును.

1] బలమైన రియాక్షన్ కలిగియుండును. దీనిని "$A_1$ Antigen" అంటారు.

2] కొద్దిగా రియాక్షన్ కలిగించునది. దీనిని "$A_2$ Antigen" అంటారు.

ఈ విధముగా 'A' Group రక్తమునందు "$A_1$, $A_2$" అను రెండు రకము లుండును.

'B' Group (బి గ్రూప్) : రక్తములోని ఎఱ్ఱ రక్తకణములలో 'B' Antigen ఉండును. ప్లాస్మా యందు Anti 'A' Antibody ఉండును.

'AB' Group : ఈ రక్తములోని ఎఱ్ఱ కణములలో 'AB' Antigen లు రెండు ఉండును. కావున వీరి ప్లాస్మాలో Anti 'A', Anti 'B' Antibody లు ఉండును.

'O' Group : ఈ రక్తములోని ఎఱ్ఱ కణము లలో 'A' 'B' Antigen లు ఉండవు. కనుక వీరి రక్తములోని ప్లాస్మాయందు Anti 'A', Anti 'B' antibody లు రెండును ఉండును. రక్తమార్పిడి చేయు నపుడు రక్తదాతయొక్క రక్తములో 'A' antigen ఉన్ననూ... ఆ Antigen కు వ్యతిరేకముగా ఉండు Anti body రక్త గ్రహీతలో ఉండరాదు. ఉదాహరణ : రక్త దాత యొక్క రక్తములో Anti 'A' Anti body ఉండరాదు. రక్తదాత రక్తములో 'B' Antigen ఉన్నయెడల రక్తగ్రహీత రక్తమునందు Anti 'B' Antibody ఉండరాదు.

| రక్తదాత : | రక్తగ్రహీత : |
|---|---|
| 'A' Group | A, AB గ్రూప్ |
| 'B' Group | B, AB గ్రూప్ |
| 'AB' Group | A, B గ్రూప్ |
| 'O' Group | A, B, AB, O గ్రూప్ |

'AB' గ్రూప్ రక్తము కలిగినవారు అందరి నుండి రక్తమును స్వీకరించవచ్చును. 'O' గ్రూప్ రక్తము కలిగినవారు అందరికీ రక్తమును ఇవ్వవచ్చును. రక్తదాత, రక్త గ్రహీత గ్రూప్‌లు సరైనవి అయిననూ రక్త మార్పిడిలో ప్రమాదకరమైన Reaction రాకుండా (మైనర్ గ్రూప్స్ ఉన్ననూ)... Cross matching పరీక్ష చేయుదురు.

రక్తము సేకరించుటలో జాగ్రత్తలు : పూర్తి ఆరోగ్యవంతులైన 18 నుండి 50 సంవత్సరముల వయస్సుగల వారినుండి మాత్రమే రక్తమును సేకరించవలెను. గర్భిణీ స్త్రీలనుండి, వ్యాధిగ్రస్తుల నుండి రక్తము సేకరించరాదు. ఒక వ్యక్తినుండి సుమారు 120 దినములలోగా రెండవసారి రక్తమును సేకరించరాదు. రక్తమును సేకరించేముందు, రక్తదాత యొక్క Blood group ను, మరియు Rh-D లను పరీక్షించవలెను.

ఇతర బ్లడ్‌గ్రూప్స్ : పైన పేర్కొన్న నాలుగు గ్రూప్‌లుగాక మన రక్తమునందు క్రింది మైనర్ గ్రూప్స్ కూడ ఉండవచ్చును. 1] 'Li' Group, 2] Luthern Group (లూథెరిన్ గ్రూప్), 3] Lewis Group (లెవిస్ గ్రూప్), 4] 'MN' Group, 5] Kidd Group (కిడ్ గ్రూప్), 6] P Group, 7] Duffy Group (డఫీ గ్రూప్).

Rh. Anti-D : రక్తములోని 'D' Antigen లను ఉపయోగించి దీనిని రెండు రకములుగా విభజించినారు. అవి : 1] ఎఱ్ఱకణములలో 'D' Antigen ఉన్న యెడల దీనిని "Rh-positive (+ve group)" అని అంటారు. 2] ఎఱ్ఱ రక్త కణములపై 'D' Antigen లేనియెడల దీనిని "Rh-Negative (–ve Group)" అని అంటారు. Rh-Negative (Group) రక్తములో ప్లాస్మాయందు Anti 'D' Anti body సాధారణముగా ఉండదు. ఈ Rh. Anti 'D' Anti Body లేనటువంటి రక్తములో Rh +ve Antigen కలిసినచో రక్తము sensitive (సెన్సిటివ్) జరిగి; Rh –ve లో Antibody లు ఉత్పత్తి యగును. ఈ విధముగా Rh –ve రక్తమువారికి Rh +ve రక్తము ఇచ్చినపుడు గాని, Rh –ve తల్లికి Rh +ve బిడ్డ పుట్టినపుడు గాని ఇలా రక్తములో Sensitive జరుగును. ఈ విధముగా Sensitive అయిన రక్తమునకు తిరిగి Rh +ve రక్తము కలిసినచో ఈ Plasma (ప్లాస్మా)లో ఉండు Anti 'D' Anti body రక్తకణములో ఉండు Antigen తో కలిసి రక్తకణములను నాశనము చేయును.

Bleeding time (బ్లీడింగ్ టైమ్) : రక్తము స్రవించు సమయము గుర్తించుట : ఏదైనా సందర్భములో తెగుట, దెబ్బలు తగులుట

వలన శరీరమునకు గాయము ఏర్పడి; రక్తము స్రవించును. కొందరిలో ఇది వారి శరీర తత్వము ననుసరించి (రక్తము స్రవించుటలో) హెచ్చుతగ్గులు కనిపించును. కొన్ని రకముల వ్యాధులు కలిగిన వారికి అధికముగా రక్తము స్రవించుట సంభవించును. ఇది అతి ప్రమాదకరమైన లక్షణము! ఇటువంటి లక్షణము కలిగిన వారికి- ఏవైనా శస్త్రచికిత్సలు చేయు సమయములో... రోగి రక్తము అధికముగా స్రవించుట జరుగును. కావున ముందుగా రోగి రక్తము స్రవించు సమయమును గుర్తించినయెడల తగిన జాగ్రత్తలను తీసి కొనవచ్చును.

**Clotting time** (క్లాటింగ్ టైమ్) రక్తము గడ్డకట్టు సమయము : ఏదైనా గాయము ఏర్పడినపుడు రక్తము స్రవించును. ఇలా స్రవించిన రక్తము కొద్ది సమయములో గడ్డకట్టును. శరీరతత్వముననుసరించి రక్తము గడ్డకట్టు సమయములో మార్పులు కనిపించును. కొన్నిరకముల వ్యాధులు వ్యాపించిన వారికి రక్తము గడ్డకట్టుటకు ఎక్కువ సమయము పట్టును. ఇది అతి ప్రమాదకరమైన లక్షణము! సాధారణముగా రక్తము స్రవించు సమయము ఎక్కువ ఉన్న వారికి రక్తము గడ్డకట్టుటకు ఎక్కువ కాలము పట్టును. ఈ పరీక్ష చేయుట ద్వారా రోగియొక్క రక్తము గడ్డకట్టుటకు ఎంత సమయము పడుతున్నదో తెలిసి కొనవచ్చును.

**E.S.R. Test** (Eryth-rocyte Sedimentation Rate = ఎరిథ్రోసైట్ సెడిమెంటేషన్ రేట్) : రక్తము నందుగల ఎరిథ్రోసైట్స్ పరిమాణమును తెలిసి కొనుటకు ఈ పరీక్ష చేయుదురు, రక్తమునందు ఎరిథ్రోసైట్స్ తగ్గుటవలన అనేక రకములైన వ్యాధులు వ్యాపించును.

**Malaria Parasites Test** (మలేరియా పారాసైట్స్ టెస్ట్) మలేరియా వ్యాధి పరీక్ష: మలేరియా వ్యాధి వ్యాపించుటకు ముఖ్య కారణము "ఎనాఫిలిస్" అను దోమకాటు! ఈ దోమకాటువలన మన శరీరమునందు "ప్లాస్మోడియమ్" అను పారాసైట్స్ ప్రవేశించును. ఈ పారాసైట్స్ రక్తప్రసరణ ద్వారా కాలేయమునకు చేరి, అక్కడ కొన్ని మార్పులుచెంది, తరువాత తిరిగి రక్త నాళములలో ప్రవేశించి, ఎఱ్ఱరక్తకణము లందు చేరి; మలేరియా వ్యాధిని వ్యాపింప జేయును. వీటి ఉనికిని గ్రహించుటకే ఈ పరీక్ష చేయబడును.

**Mean Corpuscular Volume(M.C.V.) Test** (మీన్ కార్పస్క్యులర్ వ్యాల్యూమ్ టెస్ట్) : రోగి రక్తములోని M.C.V. పరిమాణమును తెలిసికొనుటకు ఈ పరీక్ష చేయుదురు. ముందుగా P.C.V. మరియు ఎఱ్ఱరక్తకణముల సంఖ్యను తెలిసికొనుట వలన M.C.V. ని సులభముగా గుర్తించ వచ్చును. రోగి రక్తములోని M.C.V. 78 cu. Microns కంటె తగ్గిన యెడల దీనిని Microcytic Anaemia (మైక్రోసైటిక్ ఎనీమియా) వ్యాధిగా గుర్తించవలెను. రోగి రక్తములోని M.C.V. 14 cu. Microns (మైక్రాన్స్) కంటె పెరిగిన యెడల Microcytic anaemia (మైక్రోసైటిక్ ఎనీమియా) వ్యాధిగా గుర్తించవలెను.

**Mean Corpuscular Hemoglobin (M.C.H.) Test** (మీన్ కార్పస్క్యులర్ హిమోగ్లోబిన్ టెస్ట్) రోగి రక్తములోని హిమోగ్లోబిన్ను తెలిసికొనుట : ముందుగా హిమోగ్లోబిన్ పరిమాణమును మరియు ఎఱ్ఱరక్తకణముల సంఖ్యను పరీక్షించిన తరువాత.... ఈ రెండు ఫలితముల ఆధారముగా M.C.H.ని సులభముగా నిర్ధారించవచ్చును. ఈ పరీక్ష చేయుట

వలన రోగి ఎఱ్ఱరక్తకణములలోని హెమో గ్లోబిన్ పరిమాణమును తెలిసికోవచ్చును. ఇది 27 Micro Micrograms (27 మైక్రో మైక్రోగ్రామ్స్) కంటె తగ్గినయెడల దీనిని... Hypochronic anaemia (హైపోక్రానిక్ ఎనీమియా) వ్యాధిగా గ్రహించవలయును.

Micro Filaria Test (మైక్రో ఫైలేరియా టెస్ట్) : "క్యూలెక్స్ ఫాటగన్" అను దోమ కాటువలన ఫైలేరియా వ్యాధి వ్యాపించును. ఫైలేరియా క్రిములలో- మానవులకు సాధారణముగా వ్యాపించునది "వూకరే రియా".... ఇది సుమారు 4 to 8 m.m. పొడవు కలిగియుండును. ఇది రాత్రి సమ యములలో మాత్రమే రక్తప్రసరణ ద్వారా వ్రేళ్ళకొనలకు చేరును. రాత్రి సమయములో సేకరించిన రక్తములో మాత్రమే ఈ క్రిములు కనిపించును. ఫైలేరియా క్రిములు శరీరము నందు ప్రవేశించిన ఆఱు మాసముల తరువాత... వ్యాధి లక్షణము బయటకు కనిపించును. ఈ క్రిముల ఉనికిని పై పరీక్షద్వారా నిర్ధారణ చేయబడును.

Packed Cell Volume Test(ప్యాక్డ్ సెల్ వాల్యూమ్ టెస్ట్) : అనీమియా, రక్తస్రావము మొదలగు వ్యాధుల వలన రక్తములోని P.C.V. తగ్గుట సంభవించును. Severe burns (సివియర్ బరన్స్), Dehydration (డిహైడ్రేషన్), Diarrhoea (డయే రియా), Cholera (కలరా) మొదలగు వ్యాధుల యందు P.C.V. పెరుగుట సంభవించును. రక్తములోని P.C.V.ని నిర్ధారణ చేసి, వ్యాధి నిర్ణయము చేయు టకు ఈ పరీక్ష సాయపడును.

Sugar (Blood) Test = సుగర్ (బ్లడ్) టెస్ట్: రోగియందు 'సుగర్' యొక్క పరిమాణమును తెలిసికొనుటకు... ఈ పరీక్ష చేయుదురు. కొన్ని సమయాలలో వ్యాధిగ్రస్తుని మూత్రము నందు 'సుగర్' ఉన్ననూ... రక్తమునందు 'సుగర్' ఉండకపోవచ్చును. సుగర్వ్యాధి ఉన్నదీ, లేనిదీ కచ్చితముగా తెలిసి కొనుటకు ఈ పరీక్షచేయుట చాలా అవసరము! ఈ పరీక్షను రెండు విధములుగా చేయుదురు : 1] Fasting blood sugar test (రోగి ఎలాంటి ఆహారము తీసికొనకముందు చేయునది), 2] Post lunch blood sugar test (ఆహా రము తీసికొన్న తరువాత చేయునది) రోగి రక్తములో సుగర్ ఉన్నయెడల అతనికి సుగర్వ్యాధి ఉన్నదని గ్రహించవలెను.

Urea (Blood) Test = యూరియా (బ్లడ్) టెస్ట్ : ఆహారములోని మాంసకృత్తులు కాలేయమునందు జీర్ణమైన తరువాత మిగిలిన మలిన పదార్థములతో 'యూరియా' తయారగును. ఇది కాలేయమునుండి రక్తములోనికి ప్రవేశించును. రక్తములో యూరియా పెరుగుటవలన అనేక వ్యాధులు రాగలవు. రోగి రక్తములోని యూరియా పరిమాణమును తెలిసికొనుటకు ఈ పరీక్షను చేయుదురు.

Uric Acid Test (యూరిక్ ఏసిడ్ టెస్ట్) : రోగి రక్తమునందుగల 'యూరిక్యాసిడ్' పరిమాణమును తెలిసికొనుటకు ఈ పరీక్ష చేయుదురు.

Serum Calcium Test (సీరమ్ కాల్షియమ్ టెస్ట్) : రోగి రక్తమునందున్న cholesterol పరిమాణమును గుర్తించుటకు ఈ పరీక్ష చేయుదురు.

Serum Creatinine Test (సీరమ్ క్రియే టినైన్ టెస్ట్) : రోగి రక్తమునందుగల creatinine పరిమాణమును తెలిసి కొనుటకు ఈ పరీక్షను చేయుదురు.

*గమనిక :* పై పరీక్షలసాయమున పలు వ్యాధులు నిర్ధారించబడుచున్నవి.

# ANNEXURE-12
## SOME IMPORTANT LAB. TESTS
## కొన్ని ముఖ్యమైన పరిశోధనశాలా పరీక్షలు

C.S.F. = Cerebro Spinal Fluid Test (సి.ఎస్.ఎఫ్ = సెరెబ్రో స్పైనల్ ఫ్లూయిడ్ టెస్ట్) వెన్నుపూసల నీరు పరీక్షించుట : "C.S.F." అనునది మెదడు, వెన్నుపాము చుట్టు ఉండే ద్రవపదార్థము! దీనివలన కేంద్రనాడీమండలమునకు ఆహారము లభించును. మరియును ఇది వెన్ను పామునకు ఎటువంటి అపాయమును కలుగ కుండ కాపాడును. "మైనిన్జైటిన్" అనునట్టి సూక్ష్మ జీవులు కేంద్రనాడీ మండలమును కప్పి యున్న పొరలలో వ్యాపించి "మెనిన్జైటిన్" అను వ్యాధిని వ్యాపింప జేయును. సాధారణముగా మానవుని నాడీమండలము చుట్టును 100-150 ml. C.S.F. ద్రావణము ఉండును. 'లంబర్ పంక్చర్ నీడిల్'ను వెన్నెముక మధ్యన గ్రుచ్చి 4-5 cm. లోపలకు దించిన తరువాత నీడిల్ లోని తీగను లాగ వలెను. నీడిల్ ద్వారా వెలువడు ద్రావణమును Test Tube నందు పట్టవలెను. ప్రత్యేకముగా శిక్షణ పొందినవారు మాత్రమే C.S.F. ను పరీక్షించవలెను. ఆరోగ్యవంతులలో C.S.F. స్పష్టముగా, రంగులేకుండా పాదర్శకముగా కనిపిస్తుంది. దీనిని Clear C.S.F. (క్లియర్ సి.ఎస్.ఎఫ్) గా గుర్తించెదరు. దీనియందు Pus ఉన్నయెడల Cloudy (క్లౌడీ)గా కనిపించును.

C.S.F.పసుపురంగులో కనిపించినచో... దీనిని "Xantho Chromia (జాంతో క్రోమియా)" అని అంటారు. జాండిస్ ఉన్నప్పుడుకాని, మెదడు నందలి రక్త నాళములు తెగినప్పుడుగాని, వెన్నుపాము మధ్యలో అడ్డు ఏర్పడినపుడు గాని ఈ C.S.F. పసుపురంగులో కనిపించును.

ఆరోగ్యవంతుల C.S.F. గడ్డకట్టదు. Tuber Closis Meningitis (ట్యూబర్ క్లోసిస్ మెనింజైటిస్) Meningitis (మెనింజైటిస్); Spinal Contraction (స్పైనల్ కాంట్రాక్షన్) మొదలగు వ్యాధులు ఏర్పడినపుడు ఇది గడ్డకట్టును.

C.S.F. ను పరీక్ష చేయునపుడు తీసికోవలసిన జాగ్రత్తలు.

1] C.S.F.ను సేకరించిన వెంటనే పరీక్షించవలెను. నిలువయుంచినచో... కణములు, పరాన్నజీవులు చనిపోయి విచ్ఛిన్నమైపోవును.

2] దీనిని వృథాచెయ్యకూడదు. దీని యందు హానికలిగించు బ్యాక్టీరియమ్‌లు ఉండును.

3] C.S.F. ను పరీక్షించునపుడు ఇది నోటి యందు ప్రవేశించకుండా జాగ్రత్త పడ వలెను.

Leprosy Test (లెప్రసీ టెస్ట్) కుష్ఠువ్యాధి పరీక్ష : ఈ వ్యాధి ముఖ్యముగా "Mycro Bacterium Leprace (మైక్రో బాక్టీరియమ్ లెప్రస్)" అను బాక్టీరియా వలన వ్యాపించును. ఈ వ్యాధి వ్యాపించుట వలన ముందుగా రోగి చెవుల మీద, ముఖము మీద గుండ్రని బొడిపెలు వ్యాపించును. ఈ విధముగా ఏర్పడిన బొడిపెల నుండి తీసిన పదార్థములో Leprosy Bacteria లను మైక్రోస్కోప్ సాయముతో పరీక్షించవలెను.

Plague Test (ప్లేగూ-టెస్ట్) : తెవులువ్యాధి "Yersima Pestis (ఎర్సిమా పెస్టిస్)" అను బాక్టీరియా వలన వ్యాపించును. ఈ వ్యాధి వ్యాపించినవారికి శరీరము మీద Bubo (బ్యూబో) వంటి కణితలు ఏర్పడును. ఈ కణితల నుండి సేకరించిన ద్రవ పదార్థములో నున్నట్టి బాక్టీరియాను పరీక్షించవలెను. రోగి శరీరముపైమున్న Bubo ను... స్పిరిట్‌తో శుభ్రముచేసి, Sterlise చేసిన 2ml. సిరెంజ్‌ని తీసికొని, నీడిల్‌ను Bubo లోనికి గ్రుచ్చి; Bubo లోని ద్రవ పదార్థమును... సిరెంజ్ లోనికి సేకరించవలెను. ఈ ద్రావణమును Slide పైకి తీసికొని; Smear తయారు చేసికొని, మైక్రోస్కోప్ సాయముతో పరీక్షించి; వ్యాధి నిర్ధారణ చేయవలెను.

Semen Analysis (సెమెన్ ఎనాలిసిస్) వీర్యపరీక్ష : వీర్యకణములు బీజకోశము లోని "Gamet (గామెట్)" అను కణము నుండి ఉత్పత్తియగును. దీనినే "Spermatogonia (స్పెర్మాటోజోనియా)" అని అంటారు. దీనియందు 46 (23 జతలు) క్రోమోజోమ్‌లు వుండును. "XY" అను క్రోమోజోమ్‌ల జతయే పిండము లింగ భేదములను నిర్ణయించును. ఈ స్పెర్మాటో జోనియా పెద్దదిగా మారి, "ప్రైమరీ స్పెర్మాటోసైట్" అను కణముగా అభివృద్ధి చెందును. ఇది మియాసిస్ పద్ధతి ద్వారా కణవిభజన చెంది; నాలుగు స్పెర్మోటిడ్స్ ఏర్పడును. వీటి యందు 23 క్రోమోజోమ్‌లు మాత్రమే యుండును. XY క్రోమోజోమ్‌లయందు ఒక్క క్రోమోజోమ్ మాత్రమే అనగా X గాని, Y గాని స్పెర్మాటిడ్ కణములలో ఉండును. ఒక్కొక్క స్పెర్మాటిడ్ ఒక్కొక్క "స్పెర్మాటోజోవా"గా అనగా వీర్యకణముగా మార్పుచెందును.

ఈ రకముగా తయారైనటువంటి వీర్య కణములు "Vasdeferens" అను నాళములగుండా వీర్యము నిలువయుండు సంచిలోనికి ప్రవేశించును. వీర్యస్ఖలనము జరుగునంతవరకు వీర్యము ఈ సంచి లోనే నిలువయుండును.

పురుషుని "X" అను క్రోమోజోమ్‌గల వీర్య కణము స్త్రీ యొక్క అండమును కలిసిన యెడల స్త్రీ శిశువు జన్మించును. Y క్రోమోజోమ్ ఉన్న వీర్యకణము స్త్రీ అండమును కలిసినయెడల మగశిశువు జన్మించును. సాధారణముగా... ఆరోగ్యవంతుడైన మానవుని యందు ఒక్కసారి వెలువడు వీర్యము 2 నుండి 5ml. వరకు ఉండును. 1ml. వీర్యమునందు 70 నుండి 200 మిలియన్‌ల వరకు వీర్యకణములు (Sperms= స్పెర్మ్స్) ఉండును. వీర్యము బయటకు వెలువడిన వెంటనే 90 నుండి 120 సెకన్స్‌లో జిగురువలె గట్టిగా మారును. 20 నిమిషముల తరువాత అది ద్రవ పదార్థమువలె మారును. అందువల్లన వీర్యపరీక్ష చేయునపుడు 20 నిమిషముల తరువాత పరీక్ష చేయవలయును. ఒక గంట తరువాత వీర్య కణములు చచ్చి పోవును. అందువలన వీర్యము సేకరించిన తరువాత గంటకంటె ఎక్కువసేపు నిలువ యుంచరాదు. వీర్య కణములయందు 50% వరకు శక్తివంతముగా కదలు చుండును. 40% కన్న తక్కువ వీర్యకణములు కదలుచున్న యెడల ఈ వీర్యము అండమును ఫలదీకరించుటకు పనికిరాదు. "N.P." అను వీర్య పరీక్ష చేయునపుడు క్రింది అంశములను జాగ్రత్తగా పరిశీలించవలయును.

బాహ్యపరీక్ష: 1] పరిమాణము, 2] రంగు, 3] వీర్యము సేకరించినప్పుడు ద్రవముగా

ఉన్నదా? చిక్కగా ఉన్నదా? 4] వీర్యము సేకరించిన తరువాత ఎంత సమయములో ద్రవముగా మారినది? 5] క్షార మరియు ఆమ్ల స్వభావము.

**Microscope Examination** (మైక్రోస్కోప్ ఎగ్జామినేషన్) : వీర్యము (Semen) ను మైక్రోస్కోప్ నందు పరీక్షించునపుడు 1] వీర్య కణములు ఉన్నవీ, లేనిదీ గమనించుట,

2] వీర్య కణములు ఉన్నచో ఎంతశాతము కదలుచున్నవో గమనించుట;

3] వీర్య కణములు 1ml.లో ఎన్ని ఉన్నవో గుర్తించుట చాల ముఖ్యమని గ్రహించ వలయును.

**Sputum Test** (స్పుటమ్ టెస్ట్) తెమడ పరీక్ష :

**Ziehl Neelsen Stain (A.F.B) =** జీహ్ల్ నీల్‌సెన్ స్టెన్ (ఎ.ఎఫ్.బి) : ఈ పరీక్ష నిర్వహించుటద్వారా రోగికి క్షయవ్యాధి వ్యాపించినదీ లేనిదీ నిర్ధారించవచ్చును. ఈ పరీక్ష నిర్వహించుటకు రోగియొక్క తెమడను సేకరించవలెను. రోగి ఏటవాలుగా నిలబడి శ్వాస పీల్చిన తరువాత ఒక్కసారి గట్టిగా దగ్గుటవలన బయటికి వచ్చిన తెమడను- శుభ్రమైన సీసా యందు పట్టవలెను. Loop సహాయముతో ఆ తెమడను తీసికొని, శుభ్రమైన Slide పైన పలుచని Smear తీయవలెను. Slide ఆరిన తరువాత Spirit Lamp (స్పిరిట్ లాంప్) మంటలో రెండు మూడుసార్లు Slide ను త్రిప్పవలెను. తరువాత Slide ను స్టాండ్‌పైన అమర్చి Stain చేయవలెను. ఆ Stain ను మైక్రోస్కోప్‌తో పరీక్షించి రోగ నిర్ధారణ చేయవలెను.

**Syphilis Test** (సిఫిలిస్ టెస్ట్) సిఫిలిస్ వ్యాధి పరీక్ష : ఈ పరీక్ష చేయుటవలన పురుషులయందు Syphilis వ్యాధి వ్యాపించినదీ, లేనిదీ తెలిసికొనవచ్చును. ఈ వ్యాధి వ్యాపించిన రోగి అంగముపైన ఒకటిరెండు cm. వైశాల్యము కలిగిన పుండు ఏర్పడును. పరీక్ష చేయుటకు ముందు రోగి అంగముపైనున్న పుండును NACL Solution తో కడుగవలెను. ఆరిన తరువాత ఈ పుండుయొక్క చివరిభాగమును వేడిచేసిన Lancet తో రుద్దవలెను. పుండునుండి రక్తము రాకుండ జాగ్రత్తపడవలెను. తరువాత పుండుపైన గాజుగుడ్డతో అద్దవలెను. కొంతసేపటి తరువాత పుండుపైన గులాబిరంగువంటి ద్రవపదార్థము వచ్చును. ఈ ద్రవ పదార్థమును Pipette నందు తీసుకొని శుభ్రమైన Slide పైన ఒకచుక్క వేయవలెను. తరువాత Slide పైన Cover Slip (కవర్ స్లిప్) చేర్చి, మైక్రోస్కోప్ సహాయముతో Slide పైయున్న బాక్టీరియాలను పరీక్షించి వ్యాధి నిర్ధారణ చేయవలెను.

**V.D.R.L. (Veneral diseases Research Laboratory Test =** వెనిరీయల్ డిసీజెస్ రిసెర్చ్ లేబొరేటరీ టెస్ట్) సిఫిలిస్ వ్యాధిని కనుగొనుటకు మరో పరీక్ష (వి.డి.ఆర్.ఎల్) : రోగి యొక్క సీరమ్ నందు (Syphilis) సిఫిలిస్ వ్యాధిని కలిగించు క్రిమికి Anti bodys ఉన్నదో, లేదో కనుగొనుటకు ఈ పరీక్ష ఉపయోగ పడును. "సిఫిలిస్" అనువ్యాధి "Tripone mapalidum (ట్రెపోన్ మాపలిడమ్)" అనే క్రిమివలన వ్యాపించును. అనగా ఈ క్రిమి స్త్రీ పురుషుల మధ్య సంయోగము వలన సంక్రమించును. అందువలన ఈ వ్యాధి వ్యాపించిన రోగియొక్క భార్యకు లేక

భర్తకు ఈ పరీక్షచేయుట కూడ అవసరము! ఈ Anti body ల యొక్క ఉనికిని Lopid antien (లోపిడ్ యాంటిజెన్)ల సహాయముతో కనుగొందురు.

సుమారు 30 ml. సైజ్ కలిగిన శుభ్రమైన సీసాను తీసికొని, అందులో ఒక ml. పిప్పెట్ సహాయముతో 0.4 ml. V.D.R.L. Buffer Solution (బఫర్ సొల్యూషన్) తీసికొని; సీసా అడుగు భాగమున పోయవలెను. మరియొక ml. పిప్పెట్ సహాయముతో 0.5 తీసికొని, ఒక్కొక్కచుక్క Antigen ను సీసాలో మెల్లగావేస్తూ కలుపవలెను. తిరిగి 5 ml. పిప్పెట్ సహాయముతో 4.1 ml. V.D.R.L. Buffer solution ను తీసికొని ఇదే సీసాలో కలుపవలెను.

సీసాపైన మూతను బిగించి 60 సెకన్‌ల వఱకు సీసాను బాగుగా కదుపవలెను. ఈ విధముగా తయారుచేసిన Antigen solution ను V.D.R.L. పరీక్షచేయుటకు ఉపయోగించవలెను. ఈ Antigen ను ఒకరోజు దాటిన తరువాత ఉపయోగించరాదు.

Widal Test (వైడల్ టెస్ట్) సన్నిపాత జ్వర పరీక్ష: ఈ పరీక్ష చేయుటవలన రోగి సీరమ్ నందు టైఫాయిడ్ వ్యాధి ఉన్నదీ, లేనిదీ తెలిసికోవచ్చును. ఈ వ్యాధి ముఖ్యముగా "Salmonell paratyphi-A (సాల్మోనెల్ పారాటైఫీ-ఎ)"; "Salmonell paratyphi-B (సాల్మోనెల్ పారాటైఫీ -బి)" అను బాక్టీరియాల వలన వ్యాపించును. ఈ క్రిములు శరీరములో ప్రవేశించినపుడు మానవుని రక్తములో Anti body లు ఉత్పత్తియగును. ఈ యాంటీబాడీలు "1] Somatic anti body (O-Anti body), 2] Flagella anti body (H. Anti body)" అని రెండు రకాలు! 'O' Anti body అనునది బాక్టీరియా యందలి కణములోనుండు 'O' Antigen కు వ్యతిరేకముగా తయారగును. ఈ 'O' Antigen పైన 3 రకముల బాక్టీరియాలు ఒకేవిధముగా ఉండును గనుక... 'O' Anti body ఈ మూడు బాక్టీరియాలలోని Antigen పైన పని చేయును. కాని... 'H' antigen అనునది మూడు బాక్టీరియాలలోను వేఱువేఱుగా ఉండును. Typhi (టైఫీ) బాక్టీరియా యందు 'H' antigen ఉండును. 'HA' Antigen ఉండును. Paratyphi-A బాక్టీరియా యందు 'HA' antigen ఉండును. Paratyphi-Bలో 'HB' antigen ఉండును. ఈ మూడింటికీ తయారగు Anti body లను వరుసగా "H, AH, BH యాంటీబాడీ" లంటారు. రక్తము నందు బాక్టీరియా ప్రవేశించిన ఆఱు రోజుల తరువాత మాత్రమే 'O' Anti body లు రోగి సీరమ్‌నందు కనిపించును. 3-4 వారముల వఱకు గాఢత పెరుగును. తరువాత గాఢత తగ్గి, వ్యాధి తగ్గిన పిదప ఇది కనిపించును. 3-4 వారముల వఱకు గాఢత పెరుగును. తరువాత గాఢత తగ్గి, వ్యాధి తగ్గిన పిదప ఇది కనిపించును. 'H' Anti body రోగి సీరమ్‌నందు కొంచెము ఆలస్యముగా కనిపించినను... ఎక్కువ కాలమువఱకు సీరమ్‌నందు కనిపించును. వ్యాధి తగ్గిన తరువాత కూడ... Anti body లు కనిపించును. Widal పరీక్షలో Salmonella antigen ను రంగువేసి ఉపయోగించెదరు. చంపబడిన Solmonella bacteria లను, ఈ Antigen లను ఉపయోగించి; Slide మరియు Tube పరీక్షలను చేయుదురు.

# ANNEXURE-13
# STOOL TESTS
# మల పరీక్షలు

మలపరీక్ష కొఱకు వ్యాధి గ్రస్తుడైన రోగి నుండి ముందుగా సుమారు నాలుగు C.M.M.ల మలమును సేకరించి; మూత కలిగిన డబ్బాలోగాని, మైనపు కాగితము నందుగాని ఉంచవలెను. మూత్రము కలిసిన మలము పరీక్షకు పనికిరాదని గుర్తుంచు కోవలెను. రోగుల మలములో సాధారణముగా ఈ క్రింది క్రిములు కనిపించగలవు.

Blood fluke (బ్లడ్ ఫ్లూక్) : దీని గ్రుడ్లు మూత్రమునందు ఎక్కువగా కనిపించును. ఇది 10-15 M.M. పొడవు కలిగి, అండాకృతిలో ఒక ధ్రువమువైపు గుండ్రముగా యుండును. దీని కణకవచము సన్నగా, పలుచగా ఉండును. బూడిదరంగు నుండి లేతపసుపురంగు వఱకు కనిపించును. లోపలి భాగములో సీలియమ్ కలిగిన Embryo ఉండి; దీనిచుట్టును పొర లుండును.

Dwarf tape worm (డ్వాఫ్ టేప్ వెర్మ్): ఇది సుమారు 10-15 M.M. size కలిగి; అండాకృతిలో గుండ్రముగా నుండును. దీని కణకవచము రెండుపొరలను కలిగి యుండును. బయటి కవచము సన్నగా ఉండి; లోపలి కవచము Poles (పోల్స్) వద్ద మందముగా దారపు పోచలవలె వ్రేలాడుచుండును. లేత గ.దుమరంగులో గుండ్రని Embryo (ఎంబ్రో)ను కలిగి యుండును. దీని మధ్యభాగమునందు Granulas (గ్రాన్యులస్) స్పష్టముగా కనిపించును.

Hook worm (హుక్ వెర్మ్=కొంకిపురుగు) : ఇది 50-60 C.M.M. వ్యాసము కలిగి; Oval shape (ఓవెల్ షేప్) లో థిన్ షెల్‌ను కలిగియుండి, నల్లని గీతలవలె కనిపించును. గ్రుడ్డనుండి వెలువడిన 12-48 గంటలమధ్య పరీక్షించినచో... వీటి మొత్తమును Larva ఆక్రమించుకొని యుండును. వీటి యందు నాలుగు రకములైన గ్రుడ్లు కనిపించును. అవి :

A] Fertilized with double shell (ఫెర్టి లైజ్డ్ విత్ డబుల్ షెల్).

B] Semi-decorticated Fertilized eggs (సెమి-డెకార్టికేటెడ్ ఫెర్టిలైజ్డ్ ఎగ్స్).

C] Semi-decorticated Unfertilized eggs (సెమి-డెకార్టికేటెడ్ అన్ ఫెర్టిలైజ్డ్ ఎగ్స్).

D] Unfertilized eggs with double shell (అన్‌ఫెర్టిలైజ్డ్ ఎగ్స్ విత్ డబుల్ షెల్).

Liver Fluke (లివర్ ఫ్లూక్) : ఇది సుమారు 130 C.M.M. వ్యాసముకలిగి; అండాకృతిలో నున్నని కవచము కలిగి, రెండు గీతలుగా కనిపించును. లోపల పెద్ద కణములు, దానియందు Granular Nuclei (గ్రాన్యులర్ న్యూక్లియై) కనిపించును. ఇది పసుపురంగు నుండి... ముదురు గోధుమ రంగును కలిగియుండును. ఈ క్రిములు మలములో చాల తక్కువగా కనిపించును. కాబట్టి... జాగ్రత్తగా పరిశీలించవలెను.

Pin worm (పిన్ వెర్మ్ = నులిపురుగు) : ఇది సుమారు 50-60 C.M.M. వ్యాసమ కలిగి, అండాకృతిలో ఉండును. దీ Assymentrical (అసిమెంట్రికల్

కవచము సన్నగా, పలుచగా ఉండును. ఇది పొరలుపొరలుగా కనిపించును. దీని లోపల Granulas (గ్రాన్యులస్)తో కూడిన పదార్థముగాని, మెలికలు తిరిగిన Embryo గాని కనిపించును. ఇది రంగు లేకుండ, పారదర్శకముగా కనిపించును. పిన్ వెర్మ్‌లు మలద్వారము ప్రక్కనున్న చర్మముమీద లభించును.

**Tape worm (టేప్ వెర్మ్) :** ఇది సుమారు 10-30 M.M. వ్యాసమును గలిగి, గుండ్రముగా ఉండి, మందమైన కణ కవచమును గలిగి యుండును. కణ కవచములో అడ్డగీతలు కనిపించును. ఇది పసుపు-గోధుమరంగులో ఉండును. దీని లోపల Granules (గ్రాన్యూల్స్) కలిగిన పదార్థము, మూడుజతల Hook Lets (హుక్ లెట్స్) యుండును.

**Thread Worm (థ్రెడ్ వెర్మ్) :** ఇది మలము నందు కదలుచుండును. సుమారు 20-30 M.M. ల Size తో, 2-3 M.M.ల వెడల్పు గలిగి యుండును. దీని తోక మొనదేలి యుండును. దీని యొక్క ఆహారనాళము బయటకు కనిపించును.

**Whip worm (విప్ వెర్మ్) :** ఇది సుమారు 3-4 M.M. పొడవు గలిగి సూత్రాకారముగా నుండి, మందమైన కణ కవచమును గలిగి, రెడుపొరలతో నారింజరంగు-పసుపురంగులలో కనిపించును. రెండు Poles లోను పారదర్శకమైన గుండ్రని Plugs (ప్లగ్స్) యుండును. లోపలివైపున Granular (గ్రాన్యులర్) పదార్థము కనిపించును. వీటి సంఖ్య ఎంత ఉన్నదో గమనించుట అవసరము!

శరీరములోనికి ఏయే పురుగులు ఎట్లు చేరగలవో క్రింద పేర్కొనబడినది.

1] **Dwarf tape worm, Whip worm:** శుభ్రపరచని కూరగాయలను తిన్న యెడల... ఇవి శరీరములోకి ప్రవేశించును.

2] **Hook worm :** చెప్పులు లేకుండా కొంకి పురుగులున్న ప్రాంతములో సంచరించి నపుడు-పాదములనుండి శరీరములోనికి ప్రవేశించును.

3] **Round worm :** పండ్లు, కూరగాయలను శుభ్రముగా కడగకుండ భుజించిన... ఇవి శరీరములోనికి ప్రవేశించును.

4] **Tape worm :** సరిగా ఉడకని పంది మాంసమును భుజించినపుడు, గుడ్లు గలిగిన మలమును తాకినపుడు బద్దె పురుగులు శరీరములోనికి ప్రవేశించును.

5] **Thread worm :** చెప్పులు లేకుండ ఈ త్రెడ్ వెర్మ్ గుడ్లు ఉన్న ప్రదేశములో సంచరించినపుడు; గుడ్లు గలిగిన మలమును తాకినపుడు ఇవి శరీరము లోనికి ప్రవేశించును.

మలమునందు కనిపించు ఇతర పదార్థములు లేదా క్రిములు :

1] **Straw granules (స్ట్రా గ్రాన్యూల్స్) :** ఇవి సుమారు 5-10 M.M. ల వ్యాసముతో కోడిగ్రుడ్డు ఆకృతిని గలిగియుండును. ఇది... Iodine నందు ఊదారంగులోను, Nacl (నాక్ల్) నందు బూడిద మరియు పసుపురంగులోను కనిపించును.

2] **Digested meat fibre (డైజెస్టెడ్ మీట్ ఫైబర్స్) :** ఇవి సుమారు 10-20 M.M. పొడవు గలిగి, కోడిగ్రుడ్డు లేదా చతురశ్రాకారములో ఉండును. ఇవి పసుపు రంగులో కనిపించును. దీనిలోపల ఎటువంటి Granular (గ్రాన్యులర్) కనిపించదు.

3] **Soaps (సోప్స్) :** ఇవి సుమారు 5-15 M.M. పొడవు గలిగి; గుండ్రముగా గాని, అండాకారముగా గాని కనిపించును.

4] Air-bubbles oil drops (ఎయిర్-బబుల్స్ ఆయిల్ డ్రాప్స్) : ఇవి ఏ పరిమాణములోనైనా కనిపించ వచ్చును. క్రమముగా, గుండ్రముగా ఉంటాయి. Air-bubbles నందు... రెండుకంటె ఎక్కువ పొరలు కనిపించును. దీని మధ్యలో ఎటువంటి పదార్థము ఉండదు.

CYSTS : ఇవి చలనములేని దశలో నున్న గుండ్రని, ఏకకణ జీవులు! వీటిలో ఒకటి గాని, అంతకంటె ఎక్కువగాని కేంద్రములు ఉండును. మానవుని శరీరములో నుండు పలు రకముల Cysts లను గుర్తించుట అవసరము! మన శరీరమునకు ఈ Cysts ద్వారా వ్యాధులు సోకును. ఇవి ద్రవరూపములో నున్న మలములోగాని, గట్టిగా ఉన్న మలములో గాని కనిపించును. మైక్రోస్కోప్ నందు పరీక్షించినపుడు సిస్ట్‌లో నున్న Nuclei లను లెక్కించవలెను. ఒకే మలములో ఒకటి కంటె ఎక్కువ రకములైన సిస్ట్ కనిపించును. సిస్ట్‌నందు ముఖ్యమైనవి మూడు రకములు!

1] Ameba (అమీబా) : దీనివలన డీసెంట్రీ వ్యాధి వ్యాపించును. ఇది 15-30 Microns వ్యాసము గలిగి, గుండ్రముగ యుండును. దీనిలో... 3-4 కేంద్రకములు ఉండును. కేంద్రకము పొర గుండ్రముగ, సన్నగా నుండును. దీని Cytoplasm ను Iodine solution నందు పరీక్షించి నపుడు... లేత పసుపు రంగులో ప్రకాశిస్తూ కనిపించును. దీని Crematid body (క్రోమాటిడ్ బాడీ) చివరలు- రంపపు పండ్లలాగ కనిపించును.

2] Giardialamblia (గార్డియాలంబియా) : ఇది సుమారు 10-15 Microne వ్యాసము గలిగి, అండాకృతిలో ఉండును. ఒక ధ్రువము రెండవ ధ్రువము కంటె గుండ్రముగా నుండును. దీని కవచము రెండు పొరలుగా ఉండును. దీనిలో 2-4 కేంద్రకములు ఉండును. కేంద్రకము పొర సన్నగా ఉండును. దీని Cytoplasm ను Iodine solution నందు వేసినపుడు... నీలి శ్వేత-ఆకుపచ్చ రంగులో ప్రకాశిస్తూ కనిపించును. దీని మధ్యలో 'S' ఆకారము గలిగిన దారపు పోగులు కనిపించును.

3] Balomtidian coli (బాలామ్టిడియన్ కోలి) : ఇది 50-100 Microne వ్యాసము గలిగి యుండును. దీని కవచము రెండు పొరలుగా ఉండి; సన్నగానుండును. దీని యందు రెండు కేంద్రకములు కనిపించును. ఒకటి Kidney shape తోనూ, రెండవది చిక్కని చుక్కవలెను కనిపించును. దీని Cytoplasm ఆకుపచ్చగా ఉండును.

Parasites (పారాసైట్స్) : మానవ శరీరములోనుండు "parasite (పరాన్న భుక్కు)" అనునది వేరొక జీవిమీద ఆధారపడి జీవించును. Host (హోస్ట్) యొక్క శరీరము వెలుపలనే జీవించే Parasite ను Ecto parasite (ఎక్టో పారాసైట్)" అంటారు. అలాగే హోస్ట్‌లో ఉండి జీవించే Parasite ను "Endo parasite (ఎండో-పారాసైట్)" అని అంటారు. పరాన్న జీవులు శరీరములో ఉన్నదీ, లేనిదీ తెలిసికొనుటకు Blood (బ్లడ్), Urine (యూరిన్), Stool (స్టూల్), C.F.S. (సి.ఎఫ్.ఎస్) మొదలగు పరీక్షలను చెయ్యాలి.

# ANNEXURE-14
# URINE TESTS
# మూత్ర పరీక్షలు

ఉదయము పూట సేకరించిన మూత్రమును పరీక్షించుట అన్ని విధముల మంచిది. శుభ్రపఱచిన గ్లాస్‌లోగాని లేక సీసాలోగాని... మూత్రమును సేకరించ వలెను. స్త్రీలకు Menses (బహిష్టు) సమయములో మూత్ర పరీక్ష చేయరాదు. మూత్ర పరీక్షను మూడు విధములుగా చేస్తారు.

1] Physical Examinations (ఫిజికల్ ఎగ్జామినేషన్స్) : ఎటువంటి రసాయనములను ఉపయోగించకుండ నిర్వహించు వాటిని "Physical Examinations" అంటారు. 2] Chemical Examinations (కెమికల్ ఎగ్జామి నేషన్స్) : వివిధ రసాయనములను ఉపయోగించినిర్వహించువాటిని "Chemical Examinations" అంటారు. 3] Microscope Examinations (మైక్రోస్కోప్ ఎగ్జామినేషన్స్) : మైక్రోస్కోప్ సహాయముతో నిర్వహించు పరీక్షలను "మైక్రోస్కోప్ పరీక్ష"లంటారు.

1] PHYSICAL EXAMINATIONS (ఫిజికల్ ఎగ్జామినేషన్స్) : 1] Quantity (క్వాంటిటి) :- రోగినుండి పరీక్ష చేయుటకు సేకరించిన మూత్రము యొక్క పరిమాణమును (ఎంత సేకరించినదీ) గుర్తించవలయును. 2] Appearance (అపియరెన్స్) : మూత్రము యొక్క బాహ్యరూపము అనగా మూత్రము నందు ఏవైనా మలినమైన పదార్థములు యున్నవేమో గుర్తించుట; ఎటువంటి పదార్థములు లేనిచో "Clear (క్లియర్)" అని; ఏవైనా కనిపించినచో "Cloudy (క్లౌడీ)" అని రిపోర్ట్‌నందు గుర్తించ వలయును. 3] Sediment (సెడిమెంట్) : మూత్రమును సేకరించిన ట్యూబ్‌నందు మూత్రము అడుగుభాగమున ఏదైన వ్యర్థ పదార్థముల సమూహము ఏర్పడినచో దానిని గుర్తించవలయును. మూత్రము అడుగుభాగమున అవక్షేపము ఏర్పడిన (Positive +VE) గానూ, ఏమియూ ఏర్పడనిచో (Negative –VE) గానూ రిపోర్ట్‌నందు గుర్తించవలయును. 4] Odour (ఆడర్) : మూత్రముయొక్క వాసన (Smell) ను గుర్తించ వలయును. మూత్రము ముఖ్యముగా Urinary volatile acid (యూరినరీ వోలటైల్ యాసిడ్) వాసనను కలిగియుండును. దీనిని గమనించి రిపోర్ట్‌నందు వ్రాయ వలెను. 5] Colour (కలర్) : రోగి మూత్రము యొక్క రంగుభేదమును గమనించవలెను. ఇది ముఖ్యముగా "Yellow, Pale yellow, Brown yellow, Red" అనునట్టి రంగులను గలిగియుండును. ఏ రంగు కలిగినదో రిపోర్ట్‌నందు వ్రాయవలెను. 7] Specific Gravity (స్పెసిఫిక్ గ్రావిటీ) : రోగి మూత్రము యొక్క సాంద్రతను కనుగొనుట! ఈ పరీక్షచేయుటకు "Urino meter" అను పరికరమును ఉపయోగించవలెను. ఒక Test tube నందు 30 Ml. మూత్రమును తీసికొని, దానిలో Urino meter ను వేయవలెను. Urino meter కొంతభాగము వఱకు మూత్ర

ములో మునిగియుండును. ఆ ప్రదేశము నందలి రీడింగ్‌ను గుర్తించి; రిపోర్ట్‌లో వ్రాయవలెను. దీనిమీద 1.000 నుండి 1.060 వఱకు గుర్తించియుండును. Normal (నార్మల్) 1.015 నుండి 1.025 వఱకు ఉండును. దీనిని అతి జాగ్రత్తగా గమనించి, రిపోర్ట్‌నందు వ్రాయవలెను. మూత్రమునందు క్షారగుణములను పరీక్షించుటకు Red litmus paper (రెడ్ లిట్మస్ పేపర్) ను తీసికొని మూత్రము నందు ముంచినచో Blue (నీలి) రంగుకు మారిన యెడల Alkaline (ఆల్కలైన్= క్షారము)గా గుర్తించవలెను. Blue litmus paper ను మూత్రము నందు ముంచినచో Red కలర్‌కు మారినయెడల Acidic (ఎసిడిక్=ఆమ్లము) మూత్రముగా గుర్తించవలయును.

2] CHEMICAL EXAMINATIONS (కెమికల్ ఎగ్జామినేషన్స్) : 1] Albumin or Protein Test (ఆల్బ్ మిన్ ఆర్ ప్రోటీన్ టెస్ట్); Cagulation of Protein (కాగులేషన్ ఆఫ్ ప్రోటీన్) : మనము భుజించు ఆహార పదార్థములోని ప్రోటీన్స్ మన శరీరమునకు ఉపయోగ పడకుండ వృథాగా మూత్రమునందు పోవును. ఇలా జరుగుట వలన రోగి నీరసించును. Albumin పరీక్షను చేయుట ద్వారా మూత్రమునందుగల ప్రోటీన్‌ను తెలిసికో వచ్చును. 2] Acetone or Ketone bodies (ఎసెటోన్ ఆర్ కెటోన్ బాడీస్): రోగి మూత్రము నందు Acetone ఉన్నదీ, లేనిదీ తెలిసికొనుటకు ఈ పరీక్ష చేయవలెను. 3] Urobilinogen Test (యూరిబిలి నోజెన్ టెస్ట్) : రోగి మూత్రము నందలి Urobilinogenను నిర్ధారించుటకు ఈ పరీక్షను చేయ వలెను. ఈ టెస్ట్‌చేయుటకు... అప్పుడే సేకరించిన మూత్రము అవసరము! మూత్రమును నిలువయుంచినచో... అందులోని Urobilinogen కు ఆక్సీకరణము జరిగి... Urobiline (యూరోబిలైన్) గా మారును. 4] Coccult blodin (కోకల్ట్ బ్లాడిన్) : మూత్రములోని రక్తమును గుర్తించుట! శరీరములో ఏవైనా లోపములు ఏర్పడి నపుడు... శరీరములోని రక్తము మూత్రము ద్వారా బయటకు వచ్చును. మూత్రములో రక్తము ఉన్నదీ, లేనిదీ కచ్చితముగా తెలిసి కొనుటకు ఈ పరీక్ష చేయవలెను. 5] Bile Salts (బైల్ సాల్ట్స్); Test for Sulpha Drugs (టెస్ట్ ఫర్ సల్ఫా డ్రగ్స్): ముఖ్యముగా రోగియందు కామెర్లవ్యాధి ఏర్పడినప్పుడు... జీర్ణశక్తి మందగించిన సమయములో ఈ పరీక్ష చేయుదురు. 6] Bile Pigments or Bilurubin Test (బైల్‌పిగ్‌మెంట్స్ ఆర్ బిలురుబిన్ టెస్ట్) : రోగి మూత్రమునందు Bile pigments ను నిర్ధారించుటకు ఈ పరీక్ష చేయుదురు. కాలేయమునందు తయారైన పైత్యరసము(Bile)లో పసుపు, ఆకుపచ్చని రంగు పదార్థములు ఉండును. కాలేయమునకు సంబంధించిన కొన్ని వ్యాధుల యందు ఈ బైల్ పిగ్మెంట్స్ రక్తముద్వారా ప్రవహించి; మూత్రము ద్వారా విసర్జింపబడును. ఈ విధముగా మూత్రపరీక్ష చేయుటద్వారా ఇది నిర్ధారించ బడును. ఈ పరీక్ష ముఖ్యముగా రోగికి కామెర్లవ్యాధి వ్యాపించినదీ, లేనిదీ నిర్ణ యించుటకు ఉపయోగపడును. 7] Logol Iodine Method (లాగల్ అయొడిన్ మెథడ్) : ఒక టెస్ట్‌ట్యూబ్ నందు 5 Ml. మూత్రమును తీసికొని, దానికి... 0.5 Ml. Logol iodine

ద్రావణమును కలుపవలెను. Test tube లోని మూత్రము నందు మారిన రంగును గమనించవలెను.

3] MICROSCOPE EXAMINATIONS (మైక్రోస్కోప్ ఎగ్జామినేషన్స్): మూత్రమునందుండు ఈ క్రింది వాటిని మైక్రోస్కోప్ సాయమున పరీక్షించి రోగ నిర్ధారణ చేయవలెను.

1] Cells : వీటియందు మూడు రకములు కలవు. అవి : A) Pus Cells, B) R.D.C.. (Blood Cells), C) Epithelial Cells.

2] Crystals (క్రిస్టల్స్): మూత్రము నందు అనేక రకము లైన క్రిస్టల్స్ ఉండును. వీటిలో ముఖ్యమైన రకములు : A) Calcium Oxalate Crystals (కాల్షియమ్ ఆక్సలేట్ క్రిస్టల్స్), B) Uric Acid Crystals (యూరిక్ యాసిడ్ క్రిస్టల్స్), C) Triple Phosphate Crystals (ట్రిపుల్ ఫాస్ఫేట్ క్రిస్టల్స్), D) Unusual Urinary Crystals (అన్‌యూజువల్ యూరినరీ క్రిస్టల్స్), E) Tyrosin Crystals (టైరో సిన్ క్రిస్టల్స్), F) Cholesterol Crystals (కొలెస్టరాల్ క్రిస్టల్స్), G) Sodium Urate Crystals (సోడియమ్ యూరేట్ క్రిస్టల్స్) మొదలగునవి.

3] Casts (కాస్ట్స్) : మూత్రమునందు కనిపించు ముఖ్యమైన Casts : A) Hyaline Casts, B) Branular Casts, C) Epithelical Casts, D) Blood Casts.

URINE SUGAR TEST (రోగి మూత్రమునందుండు చక్కెరను తెలిసి కొనుట) : మనము భుజించు ఆహార పదార్థములలోని చక్కెరను ఉపయోగించుకొను శక్తి శరీరమునందు లోపించి నపుడు... మనము భుజించిన చక్కెర పదార్థములు మూత్రము ద్వారా బయటకు వచ్చును. మూత్రమును పరీక్షించుట వలన మూత్రములోని చక్కెర పదార్థములను గుర్తించవచ్చును. రోగి మూత్రమునందు "గ్లూకోజ్" అను క్షయకరణ పదార్థము ఉన్నదీ, లేనిదీ తెలిసి కొనుటకు ఈ పరీక్షను చేయవలయును.

